సంపుటము. III || అక్టోబరు. 1913. || సంచిక. 6

# మానవసేవ

నీతి మత సంఘ పరిశ్రమ భాషావిషయములఁ జర్చించు

## సచిత్రమాసపత్రిక

రాజమహేంద్రవరము

పత్రికాసంపాదకులు

నాళము కృష్ణారావు

సత్యవోలు అప్పారావు.

సత్యవోలు అప్పారావుచే

శ్రీవిద్యానిలయ ముద్రాశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

రాజమహేంద్రవరము.

1913.

# విషయములు.



చిత్రపటములు.

సాకల్య యాజ్ఞవల్క్యసంవాదము.

# రాజపోషకులు.

1. శ్రీరాజా రావువేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారు.
2. శ్రీరాజా నాయని వేంకటరంగారావుబహద్దరువారు. మునగాల.

# పోషకులు

1. శ్రీయుత శ్రీకొవ్వూరి చంద్రారెడ్డిగారు. జమీందారు, నిడదవోలు.
2. ,, శ్రీకలిదిండి వేంకటరామరాజుగారు ,, ,,
3. ,, తమ్మన మాణిక్యముగారు ఏలూరు.
4. ,, శ్రీమోతే గంగరాజుగారు. జమీందారు. ఏలూరు.
5. శ్రీరాజా కాళేపల్లి అచ్యుతరామయ్య బహద్దరువారు. యాదవోలు.
6. శ్రీరాజా కోటగిరి వేంకటకృష్ణారావు బహద్దరువారు. గంపలగూడెం.
7. శ్రీరాజా వెలుగోటి ముద్దుకృష్ణయాచేంద్రబహద్దరువారు వేంకటగిరి.

# అభిమానులు

1. శ్రీయుత అద్దేపల్లి లక్ష్మణస్వామిగారు. ఏలూరు.
2. ,, శ్రీఉయ్యూరు మైనరు బమీందారుగారు. చెన్నపురి.
3. ,, చుండూరు శ్రీరాములుగారు. ఏలూరు.
4. శ్రీరాజా బులుసు సర్వారాయుడు బహద్దరుగారు. కపిలేశ్వరపురము.
5. శ్రీయుత డి. పానకాలరావుగారు. కోయంబత్తూరు.
6. ,, తోట రామచంద్రయ్యగారు. పూళ్ళ.
7. ,, వనమాలి జగన్నాథముగారు. రంగూను.
8. ,, అద్దేపల్లి హరిశ్చంద్రుడుగారు. కాకినాడ.
9. ,, శ్రీ ఆంధ్రమహాజనసభ. రంగూను.

# చందావివరము

——:(o):——

| | | |
|---|---|---|
| చందాదారులకు | వత్సరమునకు | రు 3 |
| అభిమానులకు | ,, | రు 5 |
| పోషకులకు | ,, | రు 10 |

రాజపోషకులయాదరణము వారియనుగ్రహాధీనము.

మాదిరిపత్రిక వలయువారు 4 అణాలపోష్టుబిళ్ళలఁ బంపవలయును.



# ప్రకటనపద్ధతి

| | పుటకు. | | | అరపుటకు |
|---|---|---|---|---|
| వత్సరమునకు | రు 30 | ... | ... | రు 18 |
| అర్ధవత్సరమునకు | 18 | ... | ... | 10 |
| మూడుమాసములకు | 10 | ... | ... | 6 |
| మాసమునకు | 3—8 | ... | ... | 2—8 |



సాకల్య యాజ్ఞవల్క్య సంవాదము.

చ. అనఘా! యొక్కఁడ వయ్యు సాత్మకృతమాయాజాతసత్త్వాదిశ
క్తినికాయస్థితి నీజగజ్జననవృద్ధిక్షోభహేతుప్రభా
వనిరూఢిం దగు దూర్ణనాభిగతి; విశ్వస్తుత్యా! విశ్వేశ! నీ
ఘనలీలామహిమార్ణవంబుఁ గడవంగా వచ్చునే యేరికిన్? 241.

సీ. సత్యవ్రతుని, నిత్యు, సంప్రాప్తిసాధనుఁ, గాలత్రయమునందుఁ గలుగువాని,
భూతంబు లైనను బుట్టువో టగువాని, నైదుభూతంబులం దమరువాని,
నైదుభూతంబులు నడఁగినపిమ్మటఁ బరఁగువానిని, సత్యభాషణంబు
సమదర్శనంబును జర పెడువానిని, నిన్నాశ్రయింతును; నీయధీన
తే. మాయచేత నెఱుక మాలినవారలు
పెక్కుగతుల నిన్నుఁ బేరుకొందు;
రెఱుఁగ నేర్చువిబుధు లేకచిత్తంబున
నఖిలమూర్తు లెల్ల నీవ యండ్రు. 242

సీ. ఆత్మకుఁ బరిశుద్ధి నర్థించువారికి ధ్యేయమవస్తువు ధీనదివ్యమూర్తి;
యంచితస్వర్గరాజ్యాభిషిక్తున కైన సమధికస్పృహణీయతముఁడ వీవు;
సద్భక్తియుతభక్తజనసులభుండవు; దుష్టాత్ములకుఁ గడు దుర్లభుండ;
వాత్మదర్శనులకు నరయ గమ్యుండవు నై యర్థి విలసిల్లు దనఘచరిత!
తే. యిట్టినిఖిలదురారాధ్య నీకు నిన్ను
నెఱయ సుజనుల కైన వర్ణింపరాదు;
పతుల నెవ్వఁడు పూజించు వాఁడు విడువఁ
జాలునే? పరమపవిత్ర! సచ్చరిత్ర! 243

చ. అరయ సమస్తజీవహృదయంబులయందు వసించి యేకమై
పరఁగి సుహృత్క్రియానుగుణభాసితధర్ముఁడవుం బరాపరే
శ్వరుఁడవు నై తనర్చుము నసజ్జనదుర్లభ మైనయట్టిను
స్థిర మగునట్టిభూతదయచేఁ బొడగానఁగ వత్తు వచ్యుతా! 244

క. కొందఱు గలఁ డందురు నినుఁ;
గొందఱు లేఁ డందు రతఁడు గుణి గాఁ డనుచుం;
గొందఱు గలఁ డని లేఁ డని
కొందఱ మందుదురు నిన్నుఁ గూర్చి మహేశా! • 245

క. నీనామవిమలగానము
నానాభవరోగకర్మనాశమునకు వి
న్నాణం బగునౌషధ మిది
కానరు దుష్టాత్ము లకట! కారుణ్యనిధీ! 246

క. ధీమహిత! భవన్మంగళ
నామస్మరణానుకీర్తనము గలహీనుల్
శ్రీమంతు లగుదు రగ్ని
ష్టోమాదికృదాళికంటె శుద్ధులు దలఁపన్ 247

క. నీనామస్తుతి శ్వపచుం
డైనను జిహ్వాగ్రమందు ననుసంధింపన్
దానికి సరి భూసురుఁడుం
గా నేరఁడు; చిత్ర మిది జగంబుల నరయన్. 248

మ. ఘనలక్ష్మీయుత మై, శుభప్రదము నై, కామాదివిధ్వంసి యై,
సనకాదిస్తుత మై, నిరంతరతపస్సంతప్తపున్నాగజీ
వన మై, యొప్పెడునీకథామృతము దాఁ బ్రీతిం గల్గునే భూరిపు
ణ్యనిరూఢత్వము లేనివారికి? జగన్నాథా! కృపాంబోనిధీ! 249

చ. హరి! భవదుఃఖభీషణదవానలదగ్ధతృషార్తమన్మనో
ద్విరదము శోభనంబును బవిత్రము నైనభవత్కథాసుధా
సరిదవగాహనంబునను సంసృతితాపము వాసి క్రమ్మఱం
దిరుగదు బ్రహ్మముం గనినధీరునిభంగిఁ బరాపరేశ్వరా! 250

క. దేహము కారాగేహము;
మోహము నిగళంబు; రాగముఖరములు రిపు
వ్యూహములు భక్తితో ని
న్నూహింపనియంతతడవు నోపరమేశా! 251

క. లంపటము నివారింపను,
సంపదఁ గృపసేయ, జయము సంపాదింపం,
జంపెడివారి వధింపను
సొంపారఁగ నీక చెల్లు నూన్నతరూపా! 252

ఆ. నిత్య! నిర్వికార! నిర్మల! నిరవద్య!
అప్రమేయ! వరద! హరి! ముకుంద!
నిన్ను గొలువఁ గంటి; నీకృపఁ గనుగొంటి;
నఖిలసౌఖ్యపదవు లందఁ గంటి. 253

ఉ. ఏవిభుపాదపద్మరతు లెన్నఁడు నెవ్వరుఁ బొంద లేని పెం
ద్రోవఁ జరింతు రట్టిబుధపోషక! నిన్ను భజించుటం బ్రమో
దావృత మయ్యెఁ జిత్తము; కృతార్థత నొందె మనోరథంబు; నీ
సేవఁ బవిత్రభావమును జెందె శరీరము సర్వరక్షకా! 254

క. దీనులకు య్యాలింపను.
దీనుల రక్షింప, మేలుదీవనఁ బొందన్
దీనావన! నీ కొప్పును
దీనపరాధీన! దేవదేవ! మహేశా! 255

క. విను దఁట జీవులమాటలు;
సను దఁట చనరానిచోట్ల; శరణార్థుల కో
యను దఁట పిలిచిన; సర్వముఁ
గను దఁట; సందేహ మయ్యెఁ గరుణావార్ధీ! 256

క. నీదిక్కు గానివారికి
నేదిక్కును లేదు వెదక నిహపరములకున్,
మోదింపఁ దలచువారికి
నీదిక్కే దిక్కు నమ్ము నిఖిలాధీశా! 257

క. నీకంటె నొం డెఱుంగను;
నీకంటెం బరులు గావ నేరరు జగముల్;
నీకంటె నొడయుఁ డెవ్వఁడు
లోకంబుల కెల్ల? నిఖిలలోకస్తుత్యా! 258

తే. నిన్నుఁ గొలువనికరములు నిష్ఫలములు;
నిన్ను పొగడనిజిహ్వ దా నీరసంబు;
నిన్నుఁ గావనిదినములు నింద్యము లగు;
నిన్నుఁ జూడనికన్నులు నీచము లగు. 259

క. జనములు నిను సేవింపని
దినములు వ్యర్థంబు లగుచుఁ దిరుగుచునుండున్
దనువులు నిలుకడ గా వఁట
వనములలో నున్న నైన వాత్సల్యనిధీ! 260

సీ. పరమేశ! నీమంజుభాషలు వినలేనికర్ణరంధ్రంబులకలిమి యేల?
చిత్తగోచర! నిన్నుఁ సేవింపఁగా లేనితనులతవలనిసౌందర్య మేల?
భువనమోహన! నిన్ను బొడగానఁగా లేనిచక్షురింద్రియములసత్వ మేల?
దయిత! నీనామామృతం బానఁగా లేనిజిహ్వకు ఫలరససిద్ధి యేల?
ఆ. వరద! నీదుదివ్యపాదపద్మంబులఁ
జేర్ప లేనిశిరముచెలువ మేల?
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని
జన్మ మేల యెన్నిజన్మములకు? 261

సీ. నీపాదకమలంబు నిటలంబు మోవంగ మోదించి నిత్యంబు మ్రొక్కఁ డేని,
నీమంగళస్తవనికరవర్ణంబులు పలుమారు వాలుకఁ బలుకఁ డేని,
నీయధీనములుగా నిఖిలకృత్యంబులుఁ బ్రియభావమున సమర్పింపఁ డేని,
నీపదాంబుజముల నిర్మలహృదయుఁ డై చింతించి మక్కువఁ జిక్కఁ డేని,
తే. నిన్నుఁ జెవులార వినఁ డేని, నీకు సేవ
సేయ రాఁ డేని బ్రహ్మంబుఁ జెందఁ గలఁడె
యోగి యైనఁ దపోవ్రతయోగి యైన
వేది యైన మహాతత్త్వవేది యైన? 262

సీ. ఇది నీకు నెల వని యే మని పల్కుదు? నొకచోటనక యెందు నుండ నేర్తు;
చెప్పనివాఁడ వం చే మని పలుకుదు? నీయంతవాఁడ వై నెగడ నేర్తు;
వీనడపడి యని యెట్లు వక్కాణింతుఁ? బూని ముప్పోకలఁ బోవ నేర్తు;
వది నేర్తు విది నేర్తు వని యేల చెప్పంగ? నేరుపు లన్నియు నీవ నేర్తు;
ఆ. వారలు గారు నీకు, వారలకు నీ వాదు;
వాంటి వీవు; మట్టు మొకఁడు లేఁడు;
పెక్కుమాట లేల? వివరింతు నీటెంకి;
సుజనులందుఁ దఱచు సొచ్చియుండు. 263

ఆ. సర్వగతుఁడ వయ్యు సమదర్శనుఁడ వయ్యు,
నొకట విషమవృత్తి నుండు దరయ;
నిచ్చ లేనివారి కీవు భక్తులు గోరు
తలఁపు లిత్తు కల్పతరువుమాడ్కి. 264

ఆ. నీకు మేలు గొనవు నీభక్తులకు గాని,
భక్తజనుల కీవ పరమగతివి;
భక్తుఁ డెందుఁ జనినఁ బరతెంతు వెనువెంట
గోవువెంటఁ దగులుకోడె భంగి. 265

ఆ. తనువు మనువు విడిచి, తనయులఁ జుట్టాల
నాలి విడిచి, సంపదాలి విడిచి
నిన్ను గాని యన్య మెన్నఁడు నెఱుఁగని
వారి విడువ వెట్టివారి నైన. 266

క. పంచేంద్రియముల తెరువుల
వంచించి మనంబులందు వరమతులు ప్రతి
ష్ఠించి వహింతురు నిన్నున్
మంచివరుం బుణ్యసతులు మరగినభంగిన్. 267

క. సాధులహృదయము నీయది;
సాధులహృదయంబు నీవు; జగముల నెల్లన్
సాధుల నీవ యెఱుంగుదు;
సాధు లెఱుంగుదురు నీదుచరితము నీశా! 268

క. నీతేజము సాధులలో
నాతత మై యుండు, వారి నలఁచుజనులకున్
హేతిక్రియ భీతి నిచ్చుం,
జేతోమోదంబుఁ జెఱుచు సిద్ధము సుమ్మీ! 269

క. నీదాస్యదమచిత్తము లిడి
యేదెసలకుఁ బోక కడతు రెఱుక కలుగువా
రాదూడయడుగుక్రియ నీ
పాదం బనునావకతన భవసాగరమున్ 270

క. నీవాఁడై నీదాసుఁ డను
భావంబులు నిలిపి ఘనులు భయవిరహితులై
యేవిఘ్నంబులఁ జెందక
నీవఱలెడి మేటిచోట నెగడుదు రీశా! 271

క. లోకేశ మొల్లక నిన్నా
లోకించుప్రపన్నులకును లోఁబడి కరుణా
లోకనములఁ బోషింతువు;
నీ కాశ్రితరక్షణములు నిజధర్మంబుల్. 272

చ. చలమున బుద్ధిమంతు లగుసాధులు నీహృదయంబు దొం
గిలికొనిపోవఁ జూతురు, రకిల్బిషభక్తిలతాచయంబులన్
నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభిరీతి; నా
వలలకుఁ జిక్కి భక్తజనవత్సలతం జన కుందు వీశ్వరా! 273

చ. అరయఁగ క్షుద్రభూతహృదయంబులయందుల నంతరాత్మవై
తిరముగ నుండునీవు భవదీయపదాంబురుహద్వయార్చనా
పరమతు లైనవారికి శుభప్రదభూరిమనోరథంబు లీ
వరుదుగ నీవె? భక్తహృదయప్రమదప్రద! ముక్తిదాయకా! 274

మ. సముఁడై స్నేహముచే సుతత్వమును విశ్వాసంబుచేతన్ సఖి
త్వముఁ జాలన్ హితవృత్తిచేతను సుహృత్త్వంబున్ సుమంత్రోపదే
శముచేతన్ నిజదేశికుం డనఁగ నిచ్చల్ పూజ్యుఁ డౌనిష్టుడై
శమవై భక్తుల కష్టకాలభయముల్ వారింతు సర్వేశ్వరా! 275

ఆ. అన్న మవనియందు, నమృతంబు గోవుల
యందు, వహ్ని సమిధలందు నమర
యోగవశతఁ బొందునోజను బుద్ధిచే
నగుణు నిన్నుఁ గాంతు రధికగుణులు. 276

మ. నినుఁ జింతించుచుఁ, బాడుచుం, బొగడుచున్, నీదివ్యచారిత్రముల్
వినుచుం జూతురు గాక, భక్తు లితరాన్వేషంబులం జూతురే
ఘనసజ్జన్మపరంపరాపారణదక్షుండై మహాయోగివా
గ్వినుతం బైనభవత్పదాబ్జయుగమున్ విశ్వేశ! విశ్వంభరా! 277

క. మండనవాటికపశువే । దండాశ్వవధూదుకూలధాన్యాదులు పై
కుండియు నాశాపాశము । ఖండింపఁగ లేవు మఱియుఁ గడమయు మమ్మా 104

క. కామోపభోగసుఖములు । వేమాఱును బురుషుఁ డనుభవించుచు నున్నన్
గామంబు శాంతిఁ బొందదు । ధూమాధ్వజుఁ డాజ్యవృష్టిఁ దృప్తింగుడు వడునే?

క. కర్మములు మేలు నిచ్చును । గర్మంబులు గీడు నిచ్చుఁ, గర్తలు దనకుం
గర్మములు బ్రహ్మ కైనను । గర్మగుఁ డై పరులఁ దపవఁగా నేమిటికిన్? 106

క. కావునఁ బరులకు హింసలు । గావింపఁగ వలదు, తనకుఁ గల్యాణముగా
భావించి పరుల నొంచినఁ । బోవునె తత్ఫలము పిదపఁ బొందక యున్నే? 107

ఆ. మానవేంద్ర! సత్యమతికి దుష్కర మెయ్య । దెఱుక గలవాని కిష్ట మెయ్య
దీనభక్తిరతుని కీరాని దెయ్యది । యెఱుక లేనివాని కేదికీడు? 108

క. నొచ్చిరి శాత్రవు లనుచును । విచ్చలవిడిఁ దిరుగ వలదు, వివిధాకృతులన్
ముచ్చిలి వత్తురు వారలు । సచ్చినయందాక మఱవఁ జన దధిపునకున్ 109

క. ఒత్తికొనుచు రానీఁ జన । దెత్తినరోగముల, రిపుల, నింద్రియముల ను
త్పత్తిసమయములఁ జెఱుపక । మెత్తన గా రాదు, రాదు మీఁద జయింపన్ 110

క. పలుపాటులఁ బడుజనులకు । నిల నొకచో నుండఁ గలదె? యేఱులవెంటన్
గలిసి చనుమ్రాఁకు లన్నియుఁ । బలువెంటలఁ బోవుఁ గాక పాయక యున్నే?

సీ. ప్రాణేశుఁ డెఱిఁగినఁ బ్రాణంబునకుఁ దెగు; దండించు నెఱిఁగిన ధరణివిభుఁడు;
మామ యెఱింగిన మను వెల్లఁ జెడిపోవుఁ; దలవరి యెఱిఁగినఁ దగులు సేయు;
దలిదండ్రు లెఱిఁగినఁ దల లెత్త కుండుదు; రేరా లెఱింగిన నెత్తి పొడుచు;
నాత్మజా లెఱిఁగిన నాదరింపరు చూచి; బంధువు లెఱిఁగిన బహి యొనర్తు;

ఆ. రితరు లెఱిఁగి రేని యింతయుఁ జాల్కఁగా । జాతః; రిందు నందు సుఖము లేదు
యశము లేదు నిర్భయానందమును లేదు । జారుఁ జేరఁ జనదు చారుముఖి! 112

క. భూతముల కగ్గు సేసిన । భూతంబులు మనకు నగ్గు పుట్టించు, వృథా
భూత మగు మనికి యొల్లను । భూతద్రోహికిని శుభము పొంద దధీశా! 113

క. చెల్లుబడి గలిగి యెవ్వఁడు । తల్లికిఁ దండ్రికిని దేహధనముల వృత్తుల్
చెల్లింపఁ దట్టికష్టుఁడు । పల్లదుఁ, డామీఁద నాత్మపలలాశి యగున్. 114

క. కాలము ప్రబలులకును బలి । కాలాత్ముం డీశ్వరుం డగణ్యుఁడు జనులన్
గాలవశులఁగాఁ జేయును । గాలము గడవంగ లేరు ఘను లెవ్వారున్. 115

క. భూమికి ధనధాన్యములకు। భామలకును మానవులకుఁ బ్రాభవములకుం
గామించి మీఁదు గానక। శ్రీమదమున మానధనులు చెనకుదు రొరులన్. 116

క. మోహితుఁ డై వనుకాంతా। వాహినిలోఁ జిక్కి క్రూరవశుఁ డౌ మనుజుం
డూహాపోహ లెఱుంగక। దేహము నలగంగఁ జేయు దీనత నెపుడున్. 117

ఆ. కుపథవర్తు లగుచుఁ గుత్సితదుర్వాచో। నిపుణు లైనవారు నిడివి దెలిసి
తొలఁగ లేక వా రధోగతిఁ బడుదురు। తప్పు లేక రాతి తెప్పభంగి. 118

సీ. నిలయము వాటించి నిర్మలదేహ లై శృంగార మేపారఁ జేయ వలయు
సత్యప్రియాలాపచతుర లై ప్రాణేశుచిత్తంబు ప్రేమ రంజింప వలయు
దాక్షిణ్యసంతోషధర్మమేధాదుల దైవత మని ప్రియుఁ దనుప వలయు
నాథుఁ డేపద్ధతి నడచు నాపద్ధతి నడచి సద్బంధుల నడప వలయు

ఆ. మార్దవమునఁ బతికి మజ్జనభోజన। శయనపానరతులు జరప వలయు
విభుఁడు పతితుఁ డైన వెలఁది పాతివ్రత్య।మహిమఁ బుణ్యుఁ జేసి మనుప వలయు

ఆ. విషయశత్రు లెల్ల విక్రాంతితోడ సా। రథిసమేతుఁ డయినరథికుఁ బట్టి
యుగ్రతిమిరమృత్యుయుత. మగుసంసార। కూపమధ్యమందుఁ గూల్తు రధిప! 120

క. తాలిమి మనకును ధర్మము। తాలిమి మూలంబు మనకు ధన్యత్వమునం
దాలిమి గల దని యీశుం। డేలించును బ్రహ్మపదము నెల్లన్ మనలన్. 121

క. క్షమ గలిగిన సిరి గలుగును। క్షమ గలిగిన వాణి గలుగు, సౌరవ్రిభయున్
క్షమ గలుగఁ దోన కలుగును। క్షమ గలిగిన మెచ్చు శౌరి సదయుం డగుచున్.

క. చతురుదధిక్షితి నేలియు। మతి మోహము విడువ లేక మానవనాథుల్
సతతముఁ దమ కీకాలం। బతిచంచల మగుట నెఱుఁగ రయ్యా మహాత్మా! 123

క. ఎప్పుడు దనకును సత్త్వము। నెప్పుడు వందాక రిపులఁ జూచియుఁ దనసైఁ
గప్పికొని యుండ వలయును। నొప్పుగ నహి మూషికమున కొదిగినభంగిన్. 124

క. పరు లెవ్వరు దా మెవ్వరు। పరికింపఁగ నేక మగుట భావింపరు త
త్పరమజ్ఞానము లేమిని। బరులును నే మనుచుఁ దోఁచుఁ బ్రాణుల కెల్లన్. 125

గీ. ఎల్లదుర్గుణములఁ గ్రోధ మెక్కుడంచు
క్రోధమున సద్గుణంబులు గ్రుంగు నంచు
ధర్మమార్గముమిత్తి క్రోధంబు సువ్వె
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 60

గీ. గాలివానల కిసుమంత కదలకుండ
పాదపంబులు నిలిచినపగిది, బుధులు
కలిమిలేములు కలిగినఁ గలఁగ కుందురు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 61

గీ. జీవ మెల్లదేహంబులఁ జెంది యుండు
జీవమును బాయ దేహంబు చెడును గాన
దేహ మది నాశనం బని తెలిసి సతము
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 62

గీ. ఆలుబిడ్డలు నీవెంట నంటి రారు
భాగ్యభోగ్యంబులను నమ్మి బ్రతుక వలదు
చిత్తవృత్తులఁ జెండినఁ జెందు సుఖము
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 63

గీ. పరధనంబున కాసింపఁ బాడి గాదు
పరసతులఁ గూడ నెంచుట పాడి గాదు
పరుల కపకార మొనరింపఁ బాడి గాదు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 64

గీ. పరసతులఁ దల్లివలె నెంచు భావమందు
పధులయున్నతి గోరుము భావమందు
పరుల వంచింప నెంచకు భావమందు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 65

గీ. సకలపాపంబులను నీవు సలుపుచుండి
యుపనిషద్వాక్యములఁ బల్కుచుందు వేని
పరమభక్తుండ వని నిన్ను బలుకఁ బోరు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 66

గీ. న్యాయమార్గంబుగా నీవు నడతు వేని
పరుల దూషించు టెన్నడు పాడి గాదు
సకలజనులను నిందించి సంతసమున
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 67

గీ. పావనం బగుధర్మంబు పదటఁ గలిపి
సత్యశౌచాదిగుణముల సంహరించి
ఘనుఁడ నని విఱ్ఱవీఁగినఁ గార్య మగునె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 68

గీ. తావితోఁ గూడుకొనియున్నపూవుభంగి
వరసుగుణరాజి నరునకు వన్నె దెచ్చుఁ
గాన సద్గుణములఁ దాల్పఁ గడఁగ వలయు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 69

గీ. తోషణంబులు విబుధసంభాషణములు
పోషణంబులు ఋజుమార్గభూషణములు
భీషణంబులు దుర్మార్గభాషణములు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 70

గీ. పాడిపంటలు గలిగి సంపదలు గలిగి
కాటకము లుండఁ గత క్షేమొ గాంచవలయుఁ
గాని బిరుదులఁ దాల్చిన ఘనుఁడ వగుదె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 71

గీ. బీదవారలు దుఃఖింపఁ బ్రీతితోన
షడ్రసోపేతముగఁ దిని సంతసించి
దేశభక్తుండ నని చాటి తిరుగఁబోకు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 72

గీ. తర్కవేదాంతమీమాంసధర్మశాస్త్ర
ములఁ బఠించిన మోహవిముక్తి రాదు
మనసునం దాశలను ద్రోసి మసలకున్న
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 73

గీ. తోడిజనులు దుఃఖింప సంతుష్టిఁ జెంది
మసలునెడ స్వేచ్ఛలే దనుమాట వినవె?
మోసమున జీవనము సేయ దోస మనరె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 74

గీ. విద్య నేర్చినమాత్రాన విబుధుఁ డగునె?
ధర్మముల నేర్చినంతన ధన్యుఁ డగునె?
వినయమును శాంతమును లేనివేళ నరుఁడు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 75

గీ. సానఁ బట్టినరత్నముసరణి దోష
తిమిరమును బాయ చిత్తంబు తేజరిల్లు
నదియు సజ్జనుమైత్రిన యబ్బుఁ గాదె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 76

గీ. పద నెఱిఁగి విత్తనముఁ జల్లుపగిది మనసు
నిర్మలం బగువేళల నీతి నాఁగఁ
బఱగు బీజములను జల్ల ఫలము దక్కు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 77

గీ. మనసు మర్కట మని చెప్పుమాట వినవె?
మానసము జిక్కఁబట్టుట మంచి దనరె?
జ్ఞానరజ్జువులో దానిఁ గట్టిపెట్టి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 78

గీ. దూషణము సేయునెడ మది దుఃఖపడక
భూషణము సేయువేళల పొంగిపడక
సమముగా నెంచు రెంటిని సజ్జనుండు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 79

గీ. నిర్మలం బగుమానసనీరరాశి
ధర్మసత్యంబు లనెడురత్నములు గలవు
జ్ఞానజాలకమున వానిఁ గనుట లెస్స
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 80

గీ. పేదలకు బిచ్చ మనిశంబుఁ బెట్టునతఁడు
సాదరంబున ధర్మంబు సలుపునతఁడు
చేయుచున్నాఁడు మానవసేవ నెపుడు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 81

గీ. వేదములు నాల్గు జదివినవిబుధవరుఁడు
తర్కవేదాంతములు నేర్చుధన్యతముఁడు
శమము దమమును లేకున్న జనుఁడు గాఁడె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 82

గీ. మోహ ముండిన లోభంబు ముసురు, దానఁ
గామ ముదయించు, నద్దానఁ గలుగు క్రోధ,
మట్టిక్రోధంబు వైరముపుట్టినిల్లు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 83

ఆ. ఉచిత మెఱుఁగుటయును, * నొరుల కిచ్చుటయును,
మంచిమాట, ధైర్య * మెంచికొనుట
యభ్యసించి పొంద * నలవడ వీసాల్గు
కూడఁ బుట్టఁ దగిన * గుణము లెన్న. 120

క. జ్ఞానము గలవిప్రుండును,
మానము వీర్యమును గల్గు * మహీపతియు, ధన
స్థాన మగు బేరి, వృద్ధుం
డై నెఱిఁ గనుకాఁపు పెద్ద * లనఁబడుదు రిలన్. 121

తే. నరులకును రూపమును ధన * మరయ విద్య
యశము సుఖమును భోగంబు * నొసఁగు విద్య
గురువుచుట్టంబు నై మేలు * గూర్చు విద్య
విద్య లేనట్టివాఁ డెన్న * వింతపశువు. 122

తే. శాంతి యుండిన మేనికిఁ * గవచ మేల?
క్రోధ ముండినఁ జెఱుపఁ శ * త్రుచయ మేల?
జ్ఞాతి యుండినఁ గాల్పంగ * జ్వలన మేల?
మంచిమిత్రుఁ డుండిన మఱి మందు లేల? 123

తే. పరమదుర్మతి గలిగినఁ * బాము లేల?
వినుత మగువిద్య గలిగిన * విత్త మేల?
పొసఁగ సిగ్గు గల్గిన మణి * భూష లేల?
మంచికవిత గల్గినను సా * మ్రాజ్య మేల? 124

తే. పరిజనులయందు దయయును, * స్వజనమందుఁ
గనికరము, దుర్జనులయందుఁ * గపటవృత్తి,
సాధుజనులందుఁ బ్రీతియు, * శత్రులందుఁ
గాకయును, గల్గువాఁడె లో * కజ్ఞుఁ డరయ. 125

క. గురుజనులయందు క్షమయును,
ధరణీశులయందు నయము, * తరుణులయందున్
వరమతియుఁ, గవులయందున్
బరమార్జవ, మున్నవాఁడె * పండితుఁ డెన్నన్. 126

తే. బుద్ధిజాడ్యము పోఁగొట్టుఁ, * బొసఁగఁ జేయు
గౌరవము, పాప ముడిగించు, * భూరికీర్తి
గలుగఁ జేయును, సత్యంబు * పలుకఁ జేయు
సజ్జనులసహవాసము * జగతియందు. 127

ఆ. దుష్టమంత్రివలన * దొరయును, సంగము
వలన యతియు, ఖలుల * వలన మతియు,
లాలనములవలన * బాలురును, గుపుత్రు
వలనఁ గులము చెడుట * గలుగు నిజము. 128

క. సప్తవ్యసనములందున్
బ్రాప్తించిన నొక్కఁ డేనిఁ * బండితుఁ డైనన్
దృప్తుఁ డయి చెడును వానికి
వ్యాప్తిం బడు నెల్లశ్రమలు * పరముం దప్పున్. 129

క. ధనమునకు దానభోగము
లును నాశము నాఁగ మూఁటి * లోనఁ దృతీయం
బొనరు నొరుల కీయక తా
నును దినకున్నట్టిచోఁ గ * నుంగొన జగతిన్. 130

ఆ. వాఁడె చూడఁదగిన * వాఁడు, గులీనుండు
వాఁడె, పండితుండు * వాఁడె, వక్త
వాఁడె, గుణ మెఱుంగు * వాఁడు వేనికి ధన
మగునొ; గుణము లర్థ * మందె యుండు. 131

క. చదు వనేకునలంకారం
బది దుష్టున కొనరియున్న * నాతనిపొందున్
వదలఁ దగు; మణి శిరంబునఁ
గదిరినసర్పంబు భీతి * కరి మగుఁ గాదే? 132

తే. సజ్జనునియందుఁ గలిగిన * సద్గుణములు
దుర్గుణంబులుగాఁ జూచు * దుర్జనుండు;
విరియఁ బూచినసంపంగి * విరులసొంపు
మధులిహంబులకంటికి * మంట గాదె. 133

తే. సిగ్గు గలవాని జడుఁ డని, * స్థిరుని శక్తి
లేనివాఁ డని, శుచి యగు * వానిఁ గపటి
యని, వ్రతపరుని దాంభికుం * డని, సువక్త
వదరుఁబోఁ తని, నిందింతు * రధమజనులు. 134

తే. సత్య మాడుటకన్నను * సత్తపంబు,
కొండెములు సెప్పకన్నను * ఘోరదుష్కృ
తంబు, సద్విద్యకన్నను * ధనచయంబు,
నయశమునకన్న మృత్యువు * నరయ లేవు. 135

క. కలువలఁ జలువలఱేఁడును,
జలజములన్ దినకరుండు * సౌరంద నొగిన్
జలుపుదురు, ఘనుఁడు జల మిడుఁ
దలఁప సుజను లొరులహితముఁ * దగఁ గూర్తు రెదన్. 136

తే. గజములు తురంగమంబులు * కట్లఁ బడుట
సూర్యచంద్రులు గ్రహపీడ * నుఱ్కుచుంట
బండితులు లేమిచేఁ గడు * బాధపడుట
గనిన విధి బలవత్తర * మనుచుఁ దోఁచు. 137

తే. కులము, శీలము, విద్యయు, * లలితరూప,
మధికయత్నకృతం బగు * నట్టిసేవ,
ఫల మొసంగ, వదృష్టంబు * గలుగుసమయ
మలర ఫలియించు,వృక్షము * లట్టు లవియు. 138

తే. కుజనసంగతి విడువుము * సుజనసమితి
భక్తి భజియింపు మెప్పుడు * పాప ముడుగ
సత్క్రియలు చేయుచుండుము * జనుఁడ నీవు
నెమ్మదిఁ దలంపు దేహ మ * నిత్య మనుచు. 139

క. మందులు మాఁకులు మెసవిన,
నెందేనియుఁ జన్న, నితరు * లెఱుఁగనినిలయం
బం దున్న, వేల్పు లడ్డిన,
సందేహము లేదు చావు * జనులకు వచ్చున్. 140

తే. గోడి దోఁఱగించు, సత్యంబుఁ * బాడిఁ జెఱచు,
దుష్టబుద్ధులఁ దగిలించు, * దోసఁగు వెంచు,
లాఘవముఁ గూర్చు, స్థిరత దొ * లంగఁ జేయు
నేమి చెప్పుదు? ధనలోభ * మెంతచెడ్డ. 141

క. వెనుకటిమే ల్మఱచుట, యో
లిసి దొరకినదానఁ దృప్తి * లేకుండుటయున్,
మనమున నవమతిఁ గొని కనుఁ
గొనుటయు నివి దుష్టజనుల * గుణములు తలఁపన్. 142

తే. కుశలవార్తల నొండొరుల్ * గోరి యడుగు
చుండ్రి లోకులు కూడిరే * నొక్కచోట
మాయురే! నాఁడునాఁట నీ * యాయు వేగు
చుండె, నిఁక నెట్టికుశల మొ * క్కో తలంప! 143

# ఆటగీతము

ఆ. వె. వెండిపళ్ళెరమున వెలుఁగొందుమంగళ
దీప మనఁగ దివ్యరూప మెసఁగఁ
బాలు ద్రావి వెల్లపాన్పుపైఁ బవళించి
యాడుకొనర యన్న! యాడుకొనర! 1

గర్భవాసమందుఁ గట్టుళ్ళఁ బడియుంటి
విప్పు నీకుఁ దగినస్వేచ్ఛ యొదవెఁ
గాలుసేతు లెలమిఁ గదలించి యాడించి
యాడుకొనర యన్న! యాడుకొనర! 2

గ్రుద్దులాడుటకునో గుప్పిళ్ళు వదలవు
సాము లెవరిమీఁద సలిపెదవుర?
సాము సేయ ముందు సమయంబు రా నోపు
నంతదనుక నన్న! యాడుకొనర! 3

తిరిగి తిరిగి తేఱి తేఱి చూచెదు చిన్ని
చిప్పలట్టికనులఱెప్ప లెత్తి;
పాదరసపుబుడ్లు భాస్కరేందులు గారు
పాలవెల్లి యిది నభంబు గాదు. 4

వింతరంగు లమర విన్నాణ మేపార
కాగితంపుఱెక్కగములు గూర్చి
పట్టి కట్టినట్టిగుడ్డచిల్కలు గాని
యందుఁ బాఱుపక్షు లయినఁ గావు. 5

మాయవస్తు లివ్వి మాసిపోవు నెపుడు
మాయ కుంభునదియె మదికిఁ గూర్చు
ననెడిపగిది దృష్టి యట్టి పైకి నిగుడ్తు
హౌర! చాపలము, సహజగుణంబొ? 6
ఏది యైనఁ గాని యిది మంచిపెద్దల
నరయువేళ గాదు; పరమయోగి
యైనఁ బొంద లేనియానందవార్ధి నో
లాడుకొనర యన్న! యాడుకొనర! 7

## సమవర్తి.



గీ. స్వాతిశయ మొకండు, మఱి పక్షపాత మొకఁడు
మెండుగా జగ మంతట నిండుకొనియె;
నీశ్వరునియొద్ద లే వనియెదరు గాని,
జనులవాక్యం బదియును నిజంబు కాదు.

గీ. ఎల్లలోకంబు దోషభూయిష్ఠముగను
జేసి, తాను నిర్దోషి యై చెలఁగినాఁడు;
స్వాతిశయమును బ్రకటింప వలయు ననెడు
తలఁ పొకటె కాక వేఱుకతంబు కలదె?

గీ. కొందఱిని గొప్పవారిగాఁ గూర్చినాఁడు;
వేఱుకొందఱి బుధులఁ గావించినాఁడు;
తిరిగి కొందఱిఁ దిరిపె మెత్తించినాఁడు;
[illegible] మూ[illegible]లుగ నొనరించినాఁడు.

గీ. తన్ను సేవించువా రన్న దయ యధికము;
కొలువ కుండినవా రన్నఁ గోప మెచ్చు;
పక్షపాతంబు లే దని పలుకు టరయ
పండితులయొక్క మౌఢ్యసంపదయ కాదె?

సీ. పండితు లని నీకు పక్షపాతము లేదు
పామరు లన్న కోపంబు లేదు;
వీరాగ్రిణు లటన్న ప్రేమ మెంతుగ లేదు,
పిరికివా రనఁగ నప్రియము లేదు;
ధనవంతు లనఁగ నాదరము హెచ్చుగ లేదు
బీదవార లనంగ వెగటు లేదు;
రారాజు లనఁగ గౌరవభావమును లేదు,
సామాన్యు లన నిరసనము లేదు;

గీ. పాపు లనినను మఱి పుణ్యవంతు లనిన
భేదబుద్ధి యొకింతయు లేదు నీకు
ఎల్లరను నొక్క రీతి శాసింతు వీవు;
సర్వసమవర్తి! దేవతాచక్రవర్తి!

సీ. విద్యాధికతఁ గల్గి వెలయుచుండినవారి,
మూఢాగ్రగణ్యులై పొలుచువారి,
ఉద్యోగపదవిచే నొప్పుచుండినవారిఁ,
దిరిపె మెత్తుచు వీథిఁ దిరుగువారి,
సౌఖ్యసంతతులతో సంతోషపడువారిఁ,
గోరికల్ బడయక కుందువారి,
సద్యశఃప్రాప్తి నుత్సాహంబు గనువారి,
నపకీర్తి కాటపట్టైనవారి,

గీ. సమము జేయును నీచండశాసనంబు;
ఎల్లజీవుల నొకరీతి నెంతు వీవు;
పక్షపాతంబు నీకు రవ్వయును లేదు;
సర్వసమవర్తి! దేవతాచక్రవర్తి!

సీ. బ్రాహ్మణు లెచటికో సామాన్యు లచటికే
సుజను లెచ్చోటికో కుజను లటకె
పండితు లెచటికో పామరు లచటికే
సరసు లెచ్చోటికో జడులు నటకె
గొప్పవా రెచటికో కొలఁదివా రచటికే
బలవంతు లెచటికో పంద లటకె
ధనవంతు లెచటికో ధనహీను లచటికే
యధికారు లెచటికో యన్యు లటకె
గీ. అందరును నొక్క-చోటికే యరుగువారు
నీదుసెల వైన; భేదంబు లేదు సుమ్ము;
ఇంతకే కొంతమంది గర్వించవలెనె?
ఆశ లీడేర కితరుల కలయవలెనె?
మ. దురితంబుల్ పొనరించుపట్ల భగవంతుం డున్నవాఁ డంచు నం
తరమందుఁ దలపోసి భీతిపడి మానం బోనిదుష్టాళికిఁ
ధర నీనామము విన్నమాత్రన మృగేంద్రస్వప్న మౌ సుమ్ము; స
చ్చరితుల్ నీదగుచెల్మికిఁ భయముగాంచఁ బోవ రొక్కింతయున్
గీ. దరి కనఁ గానిదుఃఖసాగరము నీద
తరణియే సుమి నీదుసందర్శనంబు;
తెలియకుందురె నీపేరు ధీరవరులు?
సర్వసమవర్తి! దేవతాచక్రవర్తి!

# పదునాల్గవ ప్రకరణము.

తురుష్కసైన్యములు చిత్తూరుకోటను ముట్టడించి ధ్వంసము చేసినతరువాత హతశేషులైన రజపుత్రులు తలా యొక్కొక్కదిక్కునకుఁ బారిపోయిరి. అయ్యెడ నొకరజపుత్రవీరుఁడు కనోజుపట్టణమువంకఁ బోవుచుండెను. అతఁడు సుమారు పదునాలుసంవత్సరములప్రాయము వాఁడు. చక్కనివారిలోఁ జక్కనివాఁడు. ఆతని పేరు దుర్గసింగు. అతఁ డట్లు త్రోవ నడచుచుఁ దారసిల్లినయెల్లవారిని "యోగినిని గాంచినారా?" యని ప్రశ్నించుచుండెను. యోగినిజాడ యతని కెందును నెఱుఁగరా దందున నేమియుఁ దోఁచక యొకమదుముపైఁ గూర్చుండి దిక్కులు పరికించుచుండెను. అంతఁ గొంతదూరమున నొకపురుషుఁడు వచ్చుచుండుట గని "నా కతఁడు పరిచితునివలెఁ గనఁబడుచున్నాఁడు. ఎక్కడిపరిచితుఁడో?" యని దుర్గసింగు ఆలోచించుచుండ నాపురుషుఁడు మదుమును సమీపించె. ఆవచ్చినపురుషుని దుర్గసింగు చటాలునఁ గౌఁగిలించుకొని కన్నీరు మున్నీరుగ నేడ్వసాగెను. ఆపురుషుఁడు దుర్గసింగుని దుఃఖమునుండి యోదార్చి "ఏల దుఃఖించెదవు? కష్టములు కాపురముండ నేరవు. భగవంతుఁ డార్తత్రాణపరాయణుఁడు. కష్టము లింకెట్టెక్కనున్నవి. విపత్సముద్రమును దరియుటకు ధైర్యమే తెరివంటిది." అని చెప్పెను. దుర్గసింగు, ఆనాడు రాత్రి సీతానగరమున జరిగినవిపద్వృత్తాంతమును, చిత్తూరుకోటలోఁ జిక్కియున్నతనకు యోగిని పురుషవేషముఁ గూర్చి విక్రమాజితునిబారినుండియు మ్లేచ్ఛులగందరగోళములనుండియుఁ దప్పించినవిషయమును నెఱిఁగించి యాయోగినికై నిరీక్షించుచున్నానని చెప్పెను. జనార్దనసింగు "బేలా! యేల నిరీక్షించెదవు? ఆయోగిని నేనే సుమా! కనోజుదుర్గాలయమున నాతోఁ గొంతకాలము వసించియున్నవృద్ధసన్యాసియే సీతానగరమున నిన్నుఁ గాపాడుచుండినముదుసలి. అతఁడు నాకుఁ దండ్రి. నేను దుర్గాలయమును వదలిపెట్టినతరువాత నాతండ్రితోఁ బదిమాసములు ఘుర్ మండలమున వసించి యీపురుషవేషముతో నాపట్టణనాయకుఁడైనదుల్పట్ షా యోగ్యుఁడు కావున వానికడ రాజకార్యవ్యవహారములు చక్కఁబెట్టుచుఁ

గాలక్షేపము చేసినదానను. పిమ్మట నాతండ్రికిఁ గాసవ్యాధి, యంకురింపఁగాఁ జిత్తూరున వైద్యము చేయించుటకు మూఁడుమాసములనుండి సీతానగరములో నుంటిని. నాతండ్రియొక్క బ్రతుకు కడతేరినది. ఇంక నే నున్నదానను. నాముప్పు నీవు గడపవలెను.'' అని యెఱిగించెను. దుర్గసింగు జనార్దనునివృత్తాంతమునకు నివ్వెఱపడి ‘‘అమ్మా! తల్లి లేనినిర్భాగ్యురాలను. నీవు నా కుపాధ్యాయివి. మానప్రాణములు గాపాడినదానవు. కావున నీవే తల్లి వని భావించితిని. నీవు నాతో వసింపు'' మని చెప్పెను. జనార్దనసింగు ‘‘అమ్మా! మ్లేచ్ఛులు కనోజుపై దాడి వెట్టుటకుఁ బూనుచున్నారు. నీతండ్రి యసహాయుఁడు. మనము వానికి సాహాయ్య మొనర్పవలెను. కావునఁ గొంతకాల మట నాగి తురుష్కులజాడలు గనిపెట్టి కనోజునకుఁ బోవుదము. యుద్ధము ముగియువఱకు మన రహస్యములు తెలియఁబడనీయఁగూడదు సుమా!'' యని దుర్గసింగునకు బోధించెను.

# ప దు నే న వ ప్ర క ర ణ ము.

అన్యాయార్జిత మెంతయో కాలము నిలువదు కావున బహదూర్ షహాయొక్క ప్రభ చితూరునందుఁ బక్షముదినములకంటె నెక్కువకాలము వెలుంగలేదు. ఇందునకుఁ గారణము లేమనఁ జితూరురాజ్య మజాఫ్ ఖానున కిచ్చెద నని బహదుర్షహా సమయోచితముగఁ బల్కి రాజ్యము చేఁజిక్కినతరువాతఁ దానే యేలఁ దలంచినందుకు ఖానునకు వానిపై నంతర్ద్వేషము జనించెను. అంత ఖాను దనయంతర్ద్వేషమును దీర్చుకొన సమకట్టి, చితూరుగందరగోళముతోఁ దన కేమియు సంబంధము లేనట్లు నటించుచు ఢిల్లీశ్వరునికడకుఁ బోయి "ప్రభూ! మన మింతబలియుల మయ్యు చితూరును జయింప మనకు సాహసము గలుగలేదు. మనపేరు చెప్పిన గడగడలాడుచు నామడ దూరము పాఱిపోవుబహదుర్షహా క్షణములోఁ జితూరును దనస్వాధీనము చేసికొని మహావైభవమున విఱ్ఱవీగుచున్నాఁడు. ఇంక నాతఁడు ఢిల్లీసింహాసన మెక్కుటకుఁ గంకణము గట్టుకొని యున్నట్లు తెలిసినది. మన మొనర్చిన గుజరాత్ దండయాత్రనుండి యాతఁడు మనపైఁ గసి దీర్చుకొనఁ జూచుచున్నసంగతి మీకును దెలిసియే యున్నది కదా! మన మాతనికిఁ జితూరురాజ్యము నిలువ నిచ్చితి మేని యాతఁడు మనల నింక నిలువ నీయఁడు. ఇది ముమ్మాటికి నమ్మఁదగినది." యని వచించెను.

బహదుర్షహా చితూరుపై దండెత్తి తమ కొనర్చినమహాపకారము నెఱింగించుచు, రక్షణమును వేఁడి చితూరురాణి వ్రాసినయొకలేఖ యానవాలే మనంబున గలిగించి యున్నందునఁ జక్రవర్తికి నజాఫ్ ఖానునిబోధనము నచ్చి, చితూరునుండి బహదుర్షహాను వెడలఁగొట్టుటకై యాత్రము జెంది ఖానుతో నిట్లు ప్రసంగించెను.

హుమ—చితూరును జిందఱవందఱ చేసినసుల్తానుసైన్యముతోఁ బోరాటము మన కియ్యెడ సాధ్య మగునా?

అజాఫ్—గుజరాత్ సైన్యముతోఁ బోరుట కష్టతరమే కాని, యందుకొఱకు నే నొక్కయాలోచన చేసితిని. అట్లు జరగినేని మనకు జయము తప్పక కల్గును.

హుమ—ఆయాలోచన మేమిటి?

అజాఫ్ — కనోజురాజు మనకహితు లైనవారితోఁ గూడి మనలను వంచింపఁ జూచుచున్నాఁడు. ఆసంగతి యీవఱకుఁ జెక్కుసారులు తమకు నివేదించి యున్నను, మీ రుపేక్ష చేసినారు. ఈవిషయము నిజ మని మీకు నమ్మక మున్నయెడ నాయాలోచనము వ్యర్థము గాదు.

• హుమ — నీవు చెప్పినది కాదని నే నెన్నఁడైనఁ ద్రోసివేసితినా?

అజాఫ్ — అట్లయిన వినుండు. నేను స్నేహధర్మమున బహదుర్షాకడకుఁ బోయి నాచాకచక్యమువలన వానిసేనను సహాయార్థము తీసికొని కనోజుపైకిఁ బోవుదును. అయ్యెడ మీరు బహదుర్షాను సులువుగ నెదిరించి యచ్చటనుండి తఱుమఁ గలరు. అందువలన మనకు రెండులాభములును జేకూరును.

అని వచింపఁ జక్రవర్తి సంతుష్టుఁడై యజాఫ్‌ఖానుని దనప్రయత్నములో నుండు మని యానతిచ్చిన నతండు సుల్తానుకడకుఁ బోయి తన యంతర్ద్వేషముఁ గప్పిపుచ్చి "మనసంకల్పములలో నొకటి నెఱవేఱినది. ఇంక ఢిల్లీకనోజు లేకము కాకుండ కనోజునఁ గూడ మనజెండా నాటవలెను. కావున సిబ్బందిని నాకుఁ దోడు సేయుఁడు. కనోజుపని సాంతముగఁ జక్కఁబెట్టుకొని వచ్చెద" నని చెప్ప, సుల్తాను గొంతసైన్యము మాత్రము తనకడ నుంచుకొని తక్కునసేన యంతయు నాతనికిఁ దోడు చేసి కనోజునకుఁ బంపించెను.

# పదునాఱవ ప్రకరణము.



జనార్ధనదుర్గసింగు లట్లు నడచి నడచి కనోజుపట్టణమునఁ బ్రవేశించి రాజసందర్శనము గావింప, నాతఁడు వారల నుచితరీతుల గౌరవించి "మీర లెవరు? ఎచ్చటినుండి వచ్చితిరి?" అని పృచ్ఛ చేసె. వారలు "అయ్యా! మేము రసపుత్ర కుమారులము. మాయది చిత్తూరు." అని విన్నవింపఁ "జిత్తూరుసమాచారము లేమి?" యని చందనుఁడు ప్రశ్నించెను. అందునకు జనార్దనసింగు "అయ్యా! యే మని విన్న వింతుము? ఇంకఁ జిత్తూరుపే రెం దైనఁ గలదా? మొన్నటితోఁ జిత్తూరు సున్న యయ్యెను. విక్రమాజితునకు వివాహము జరగఁబోవుచుండ మ్లేచ్ఛసైన్యములు కోటను ముట్టడించి నాశనము చేసెను. రాణాలు పరారు లైరి. రాణివాసపుస్త్రీలు చితులందుఁ బ్రవేశించిరి. రసపుత్రులు వేనవేలు కడ తేరిరి. ఆవృత్తాంతము తలంప నిప్పు డెంతేని సంతాపము గలుగుచున్నది." యని యెఱింగించెను.

ఆసమాచారము వినఁగానే చందనునికనుగొల్కులనుండి బాష్పజలము జలజల రాలెను. అయ్యెడ జనార్దనసింగు వానితో నీరీతిఁ బ్రసంగించె.

జనా—అయ్యా! యేల విలపించెదరు?

చంద—అయ్యో! నాపుత్రిక! నాపుత్రిక!—

జనా—మీపుత్రికవిషయమై యింతలో నేమి జరిగెను?

చంద—చనిపోయినది.

జనా—ఎప్పు డెట్లు చనిపోయినది?

చంద—చిత్తూరుగంధరగోళమున మృతినొందెను.

జనా—ఆమె చిత్తూరునం దేల యుండెను?

చంద—అజాఫ్ ఖానునిదుర్న్యయములకుఁ దలఁకి నాకుఁ గావలసినసంబంధ మగుటచే చిత్తూరునకుఁ బోసని యామె ఘోషించుచున్నను మోసపుచ్చి పంపియుంటిని. ఇప్పు డీగందరగోళమున నా మేనుము మృతి నొందియుండును;

అని రోదనము సేయఁ దొడఁగెను. దుర్గసింగు "అయ్యా! గతించినదానికి వగవఁ బనిలేదు. ధైర్య మవలంబింపవలెను. పుట్టినవారు గిట్టక శిలాప్రతిమలట్లు మనుదురా? మనస్వాతంత్ర్య మెం దున్నది? క్షణమునకు రాఁబోవు మేలుకీడులు మన మెఱుంగము. ఒకరికై చింతింప నేల? మీరు పేర్కొన్న అజాఫ్ ఖానుఁడే బహదుర్షాతోఁ గూడి చిత్తూరువినాశమునకుఁ గారకుఁ డయ్యె. అతఁ డిప్పుడు ఘూర్జరమ్లేచ్ఛసైన్యములతో మీపై దాడివెట్ట సంసిద్ధుఁడై వచ్చుచున్నవాడు. ఇంక మీప్రయత్నములో మీ రుండుడు. మీయం దభిమానమునఁ జేసి యీసంగతి విన్నవింప వచ్చితిమి. ఇంకఁ బోవువారము" అని చెప్పెను. అందుపైఁ జందనుడు నిశ్చేష్టుఁడై యసమానశౌర్యరాశి యని విఖ్యాతి గాంచి తనకుఁ జేదోడు వాదోడుగాఁ జరించుసౌభాగ్యవతియొక్కయు, నామె పుత్త్రిక యై యాడసింగమువోలెఁ బరాక్రమము చూపుదుర్గావతియొక్కయు వియోగములకు మరల మరల లోలోనఁ జింతించి, చేయునది లేక "మహాత్ములారా! మిమ్ము నే నిదివఱకెఱుంగకపోయినను, నీస్వల్పపరిచయమువలన నాప్తబంధువులుగా భావించుకొంటిని. ఆట్టిచిత్తూరుశూరులకే నిర్జింప నలవి కానిమ్లేచ్ఛులధాటికి నాబోటియసహాయుఁడు నిల్చు టెట్లు? మీరు శౌర్యమే ప్రధానముగాఁ గలరసపుత్త్రకుమారులు కావున సాహాయ్యము చేసి న న్నీముప్పునుండి తప్పింపుడు. మీమహోపకారము మఱచువాఁడఁ గాను" అని జనార్దనదుర్గసింగుల వేఁడికొనెను. ఆరసపుత్త్రకుమారులు పరోపకారపరాయణులగుటవలనను, కనోజారాజ్యము తమదే యన్నట్లు భావించినవారు గావునను జందనునకభయ మొసంగిరి.

అంత భేరీధ్వానంబులతో మ్లేచ్ఛసైన్యము పురంబునఁ బ్రవేశించెను. గుభిల్లు గుభిల్లు మని పిరంగులు ధ్వని చేసెను. చందనుఁడు జనార్దనదుర్గసింగులఁ గలసి వైరికి ముఖ మిచ్చి నిల్చెను. మ్లేచ్ఛసైన్యము చిత్తూరుముట్టడియందువలె నుత్సాహమును గలిగియుండలేదు. బహదుర్షాహ చితూరునందు నెలకొనియుండె. అజాఫ్ ఖానుఁడు తాను గామించినమించుబోఁడి తనకు లభింపకపోవుటచే హతాశుఁడై నిరుత్సాహుఁడై యుండె. దుల్పట్ షా తనసచివుఁడు జనార్దనసింగు చందనునిపక్ష మవలంబించుట గని మఱింత శాంతిభావమును వహించెను. రహిమాన్ అబ్దుల్ ఖానులు మాత్రము బింకము నింకను వీడలేదు. అయినను సైన్యము విశాల మై లోకములు మ్రింగులాగున డంబున విడంబించుచుండె. అయ్యెడ జనార్దనదుర్గసింగుల శౌర్యదావాగ్నులు మ్లేచ్ఛసైన్యాటవిపై

విజృంభించి మలమల మాడ్చెను. జనార్దనసింగు తొందఱగాఁ బ్రయోగించినయొక్క ఘోరశరము గుఱి తప్పి దుల్పట్‌షాకు సోఁకఁ బోవుట గని దుర్గసింగు వెంటనే యొక బాణమును బంపి యాశరవేగమును గాలిలో ఖండించి కాపాడెను. అప్పుడే జనార్దనసింగునకు, దుల్పట్‌షాపై దుర్గసింగు నెఱపిన గాఢానురాగము తెలియవచ్చెను. దుల్పట్‌షా దుర్గసింగుని సౌహృదభావమునకు సంతసించెను. అనంతరము జనార్దనసింగు ఖడ్గము చేఁబూని చేయికిఁ జేయి గలిపి యజాఫ్‌ఖానునియెడమభుజముపైఁ బెద్దగాయ మొనరింపఁ జిమ్మనగ్రోవిని జిమ్మినట్లు నెత్తురు బుస్సున వెలువడెను. అంతతో నజాఫ్‌ఖానునిబింకము పూర్తిగ నడంగెను. రహిమాన్‌ఖానుఁడు దుర్గసింగునెత్తిపైఁ గత్తితోఁ గొట్టఁ బోవ నావేటును దప్పించుకొని తా నాతనితలపై నొక్కపెట్టు పెట్టెను. అంత రహిమాన్‌ఖానుఁడు ప్రాణమాత్రావశిష్టుఁడై నేలఁ గూలెను. కనోజాసైనికులు శత్రుసేనలయందుఁ జొచ్చి చేఁజిక్కినయుద్ధసామగ్రులను దోచికొనిరి. అబ్దుల్‌ఖానుఁ డధైర్యము దోఁప అజాఫ్‌రహిమాన్‌ఖానుల నేనుఁగులమీఁద నెక్కించి వారితోఁ దిరిగి చూడక పాఱిపోయెను. చావఁగ మిగిలినకొలఁది సైన్యము చెల్లాచెదరై పోయెను. అయ్యెడ రౌతులు పోయినగుఱ్ఱములు నూఱును, నేనుఁగు లైదును కనోజారాజునకు లభించినవి.

ఈకనోజాయుద్ధమునఁ దనకు సాయము చేయకుండుటయే కాక తనయాంతరంగికుఁ డగు జనార్దనసింగు కనోజాపక్ష మవలంబింప దుల్పట్‌షా సమ్మతించినాఁ డని యతనిపై అజాఫ్‌ఖానునకు ద్వేష ముద్భవించినది. అందుచే దుల్పట్‌షా అజాఫ్‌ఖానుని వెంబడించక ఘుస్ మండలమునకుఁ బోయెను.

# పదునేడవ ప్రకరణము.



అజాపుఖానుఁడు కనోజాయుద్ధము జరపుచున్న సమయమున హుమయూను తన ఫౌజులను జితూరుపైకి నడపించెను. అయ్యెడ బహదుర్షాహ తనవద్ద నున్న కొలఁది సైన్యముతో నాతని నెదిరించి పోరెను. కాని ముఘులసైన్య మపారముగా నుండుటవలన నెట్టకేలకుఁ జితూరును వదలి గుజరాతునకుఁ బాఱిపోయెను.

సంగరాణాతో యుద్ధము చేసి యాతని నోడించియుండినను బేబరు గుణజ్ఞుఁడగుటచే సంగరాణాయెడ విశేషగౌరవాభిమానములు గలిగియుండెను. ఈవిషయ మాతఁడు తనదినచర్యపుస్తకములో వ్రాసి యుంచెను. హుమయూను తనతండ్రి యుద్దేశము ననుసరించియు, సహజముగను మేవాడ్ రాజులయెడ వారిపౌరుషముంజేసి మిక్కిలి పూజ్యభావము కలిగియుండెను. కావున నాతఁడు చితూరురాజ్యము నపేక్షింపక విక్రమాజితుని రావించి మరల నాతనిఁ జితూరున సింహాసనాధిష్ఠితుఁ జేసి రసపుత్రులచేఁ గొనియాడఁబడినవాఁడై ఢిల్లీకి మరలిపోయెను.

నిర్భాగ్యుని నెవ్వరు బాగు సేయఁగలరు? విక్రమాజితుఁడు తుచ్ఛసుఖాసక్తుఁడు, మూర్ఖుఁడు నగుటవలన నాతనిసర్దారులు వానిపైఁ దిరుగఁబడి కొలఁదికాలములోనే వానిని సంహరించిరి.

# రోహిణీచంద్రగుప్తము

## మొదటి ప్రకరణము

అలెగ్జాండరు హిందూదేశముపై దండెత్తి పోయినపిదప, మున్ను పాంచాల మని పిలువఁబడు పంజాబుదేశము పేరునకు మాత్రము పురుమహారాజుయొక్క సంతతివారి చేతులలో నుండెను. అప్పటికి నది గ్రీసుదేశీయు లగుగ్రీకులు లేక గ్రీషియను లనఁబడుపాశ్చాత్యులబాధలకు లోనుగాకుండ నుండలేదు. ఈవిదేశీయులు బుకేఫలపురమునఁ (ఇప్పు డిది జలాల్పుర మని పిలువఁబడుచున్నది.) దమనూతనరాజ్యమును సంస్థాపించిరి. అయినను స్వదేశీయులసంఖ్యతోఁ బోల్పఁబడినప్పుడు వారలు మిక్కిలి తక్కువమంది మాత్రమే యున్నను దామే యీదేశమును జయించినవారల మని గర్వితులై మిన్నును మన్నును గానకుండిరి. ఒకప్పుడు మహాప్రసిద్ధినిం గాంచి, సరిత్పంచకముచేఁ బవిత్రమై యలరారునాదేశము వారికౄరపరిపాలనాభారమునఁ గృంగి, యడ్డగింప నశక్యమైనవారియధికారప్రాబల్యమున దీనదశకు రాఁ దటస్థించెను. సారసంతములైనకొన్నిచిన్నప్రదేశములను వారిరాజ్యమునం గలుపుకొన్నతరువాత, వారీప్రదేశములఁ దమశాశ్వతప్రభుత్వమును నెలకొల్పవలె ననునాస గలిగిదానికి పునాది నేర్పఱుపఁ గుతూహలు లై యుండిరి. కాని అలెగ్జాండరు మాత్ర మిట్టియభిప్రాయముల నెన్నడును గలిగియుండలేదు. నిశ్చయముగా నాతఁ డొకమహాపురుషుఁడు. కాని యాతని దేశీయులరీతి వేఱుగ నుండెను. గర్వాంధులగువార లెల్లరును స్వదేశీయులహక్కులను లాగికొని వారిని దమపాదములక్రింద నణఁగఁద్రొక్కుటకుఁ దమశక్తికొలఁదిఁ బ్రయత్నించిరి. గ్రీకులకు లోఁబడిననూతనరాజ్యములందలిదురదృష్టవంతు లగుప్రజ లెల్లరు భయమునకు నిలయమై, కార్శ్యమునకు స్థానీభూతమై వరలువారిపరిపాలన కొదిగిమెదిగి యుండవలసివార లైరి. ఇల్లువాకిండ్ల నాక్రమించి హక్కుల నూడఁబెరికి యంతటితో నూరకుండక గ్రీకులు స్వదేశీయులను బానిసలం జేసి బాధింపఁ జొచ్చిరి. కారణము

లేకయే వారలు హింసింపఁబడుచువచ్చిరి. వారికి న్యాయము దొరకుట లేదు. కావున నవ్వు డెచ్చటఁ జూచిన నసంతృప్తియే రాజ్యము చేయుచున్నట్లు కన్పట్టెను. ఆదుర్మార్గము నాప నెవరికిని సాధ్యము కాకుండెను. స్వదేశరాజులచేతులనుండి తొలఁగింపఁబడి విదేశీయులకుఁ జిక్కినచిన్నదేశములపాట్లి ట్లుండెను. గ్రీకులకు వశము కాని సంస్థానములయొక్క భవిష్యద్దశ యెట్లుండునో నిశ్చయింప నెవరికిని శక్యము గాకుండెను.

ఆకాలమునఁ బంజాబుదేశము తుపానునందలిసముద్రమువలె నల్లకల్లోల మయి, విచారకర మగుదుస్థితిలో నుండెను. పురుమహారాజకాలమృత్యువువాతం బడినపిదప ననుభవజ్ఞానశూన్యుఁ డగునొకమాణవకుఁడు సింహాసనము నధిరోహించెను. అతఁడు గ్రీకుమంత్రులచేతులలో నొకకీలుబొమ్మ యయ్యెను. స్వీయపదవియొక్క యాధిక్యత నొక్కింతయు గుర్తించ నేరక, కుటిలురైనట్టియు, కుతంత్రములం బన్నుచుండినట్టియు దనమంత్రులు కోరిన వెల్ల నిచ్చుచు, వా రెట్లు చెప్పిన నట్లొనరించుచుఁ దుద కాతఁడు వారికి నిజమున కొకబానిసీ డయ్యెను. వారును వీలు చిక్కెఁ గదా యని సంతసించి, సమయమును వ్యర్థపుచ్చక తమమేలుకొఱకుఁ జేసికొనఁగల్గిన దెల్లఁ దమప్రయత్నలోపము లేకుండఁ జేసికొనుచుండిరి. వారలు దేశము నింకను దీనస్థితిని, బానిసత్వమునను ముంచి ధ్వంసము చేయవలె ననుదృఢనిశ్చయముతో శ్రమ యని యాలోచింపక రేయింబవలు లొక్కవిధమున నే పాటుపడసాగిరి. అప్పటివారియాలోచన లతిదురాశాపాశబద్ధులైనమహారాజుల కైనఁ దోచియుండవు.

వంశపరంపరగ వచ్చుచున్నతనసంస్థానమును బోఁగొట్టికొనినపంజాబుదేశపురాజులలో శౌర్యవంతుఁ డగుమంగళసేనుఁ డొక్కఁడు. అతఁడు నిజమైనదేశబాంధవుఁడు. అతఁ డొకచిన్నసంస్థానమునకు మాత్రమే ప్రభువు. పరిమితశతజనపదంబులు మాత్రమే యాతనిం దమప్రభువుగ నంగీకరించియుండెను. ప్రస్తుతము 'జీలము' అను పేరం బరగు వితస్తానదియొడ్డున నొక్కెడ నాతనిదివ్యహర్మ్యము కలదు. అచ్చటనే మానసీయుఁ డగునాతనితండ్రి యనురాగవంతు లగుతనప్రజ కెల్ల న్యాయమును దయసేయుచు సౌఖ్యసంపదల నొడఁగూర్చుటకుఁ జింతించుచుండువాఁడు.

కాని పాప మాభూపాలుఁడు తనదేశమున సుఖముగ నివసించి యనాయాసమరణము నొందుటకు మాత్రము నోచుకొనలేకపోయెను. అతఁడు దుర్బలుఁ డనియు, నతని రాజ్యము మిగులసారవంత మైన దనియు నాకర్ణించి విదేశీయు లాతనికొటగుమ్మమును

సమీపించి దానిని ముట్టడించిరి. కాని విధి ప్రతికూలముగ నుండుటంజేసి యామసలి రాజా ముట్టడియందు బలవంతముగ వధియింపఁబడెను. ఆతనియేకతనూభవుఁడు రణ రంగమునుండి పారిపోయి తనప్రాణమును గాపాడుకొనుట దుస్తర మయ్యెను. తరువాత నా దేశము గ్రీకుపరిపాలనమునకు లోనై, యందలిప్రజ లెల్లరు స్వాతంత్ర్యసౌఖ్యమును గోల్పోయి భయంకర మగుబానిసదేశతయొక్క కోఱలఁ దగుల్కొనిరి. పారిపోయిన మంగళసేనునిఁ జెఱఁబెట్టవలె నని గ్రీకులు చాలఁ బ్రయత్నించిరి గాని వారిప్రయత్నము లన్నియు విఫలము లయ్యెను. దేశోద్ధరణాభిప్రాయమును మనమునం దిడికొని మంగళసేనుఁడు సంచారమునం దనదినములఁ బుచ్చుచుఁ దనకు మిత్రులుగ నుండునిరుగుపొరుగుసంస్థానాధీశులం జూచుచు, నెట్లైన విదేశీయులను స్వదేశమునుండి పారఁదోల వలసిన దని వారిని బహుభంగులఁ బ్రోత్సహించుచువచ్చెను.

## రెండవ ప్రకరణము

మంగళసేనుఁడు విఖ్యాతుఁడైనబుకేఫలపుగ్రీకునాయకునికొమరితం బరిణయం బగు నుద్దేశముతో నున్నాఁ డనియు, నందువలననే గ్రీకు లతనిదుర్గమును ముట్టడించి యాతని రాజ్యంబును దమరాష్ట్రమునకుఁ గలుపుకొని రనియుఁ జెప్పుచుందురు. అయిన నాగ్రీకు నాయకునితనూజ మంగళసేనునియెడ ననురాగబద్ధ యై యుండకపోలేదు. కాని యాతఁడొకచిన్నసంస్థానమునకు మాత్రమే ప్రభు వగుటచే గ్రీకునాయకుఁడు తనతనయ నతని కొసంగుట యవమానకర మనియుఁ, గౌరవహీన మనియుఁ దలంచి యాతనిం జిన్నచూపునఁ జూచుచుండెను. కాని కాలక్రమమునఁ దననందిని కూడ నాతనియందు బద్ధానురాగ యై యున్న దని విన్నపిసప నతని కారాజపుత్రునిమీఁద వచ్చినక్రోధము నిర్వర్ణనీయము. అటుతరువాత నాతఁడు తనమిత్రులతోడ నాలోచించి యెట్లైనఁ గలహప్రారంభ మొనరించి యకస్మాత్తుగ నాతనిపైఁ బడవలె నని నిశ్చయించుకొనెను.

పితృమరణవార్త నాకర్ణించినంత మంగళసేనుఁడు ధైర్యచ్యుతుఁడై నిర్విణ్ణుఁడయ్యెను. కానఁ దనశత్రువులపైఁ బగ తీర్చుకొనుట కప్పు డతఁ డశక్తుఁడై యుండెను. తనతండ్రియొక్క మరణమును, వంశపారంపర్యముగ వచ్చుచున్న తనసంస్థానము పరరాజాపహృతం బగుటయు, తాను స్వదేశమునుండి బహిష్కరింపఁబడినసంగతియు, శత్రువులను శిక్షించుటకుఁ దనయశక్తతయు, స్వాతంత్ర్యమును గోల్పోవుటయు, వీని నన్నిఁటిని మించి తనమనోహారిణి నింకెన్నటికిని గలసికొనుట యుండదు గదా యను విచారమును నిరంతర మాతనిమానసమును గలంచుచునే యుండెను. తనతండ్రిని జంపిన ఘాతుకులపైఁ బగ దీర్చుకొనువంతదనుకఁ దనపదవిని, తా నొకప్రత్యేకవ్యక్తి ననుమాటను మఱచిపోవుదు నని యాతఁడు శపథము జేసెను. అంతియ కాక తనదేశమును పారతంత్ర్యమునుండి విముక్తం బొనరించి పంజాబుసింహాసనమునందు న్యాయైకశీలుఁడు, బలవంతుఁడు నైనవనుమతీశునిం బ్రతిష్ఠింపవలె నని యాతఁడు దృఢనిశ్చయుఁడయ్యెను.

ఈవిషయంబును హృదయంబున నుంచికొని యాయువయోధుఁడు కపటవేషధారియై యెవరు లెఱుంగకుండ బుకేఫలపురమున కరిగెను. ఈనఱ కాతఁడు పట్టణము నంతగ నెఱింగి యుండకపోవుటచే వచ్చటిప్రముఖులం జూడ వెడలఁ డయ్యెను. నిజముగా యోధున కుండవలసినలక్షణము లాతనికిఁ గల వని చెప్పిన నది యతిశయోక్తి కానేరదు. విశ్వాతుకముగ నాతఁడు రుధిరమును స్రవింపఁజేయుట కిష్టపడఁడు. అర్జునునిపరాక్రమము గుఱించినగాథ లెల్ల నాతనికి బాగుగఁ దెలియును. "ఎవ్వఁడో ప్రత్యేకముగ నొక్కఁడు చేసిననేరమునకు నిర్దోషుల నేల బాధియింపవలెను? నిజమైనయపరాధియే తనదుష్కార్యమునకుఁ బ్రతిఫల మనుభవింపవలెను. నాయకుని దండించినవెంటనే యాతనిపరిజనులు కూడ లొంగిపోఁగలరు?" అని యప్పుడప్పుడు తనలోఁ దా ననుకొనుచుండును.

ఈయాలోచనయే హృదయోపరితలంబున నుండుటంజేసి, యాతఁ డాపట్టణమందలి ముఖ్యవీధియం దనవరతముగ నడయాడుచుండెను. ఆవీధియందు విదేశీయరాజ్యసంస్థాపనకుఁ గారణభూతు లైన నాయకు లెదురుపడవచ్చు ననియు, నావిధమున స్వకార్యనిర్వహణమునందు విజయము నొందవచ్చు ననియు నాతఁడు నమ్మియుండెను. ఆవీధియందు విశాలము లైనట్టియు నున్నతము లైనట్టియు భవనంబు లుండుటచే వానియందు ముఖ్యకులీనులు నివసించుచుండవచ్చు నని యాతఁడు తలంచెను. ఇట్టియున్నతాభిప్రాయములయం దతఁ డేకాగ్రచిత్తుఁడై యుండ, నొకగొప్పజనసమూహము

తనవైపునకు వచ్చుచుండుట గాన నయ్యెను. అచ్చువారలు దేనినిగుఱించియో భయపడి యాపిన్నవానిని గూడ నటనుండి తప్పించుకొని పారిపోవలసిన దని కోరిరి కాని గాఢాలోచనానిమగ్నుఁ డగునాతనికి వారిమాటలు కర్ణగోచరములు కావయ్యెను. అతఁ డించుక ముందున కేగి తనవైపున కొకయున్మత్తగజం బరుదెంచుటఁ గాంచెను. ఆవచ్చునట్టి జంతువే యేతజ్జనపలాయనమునకుఁ గారణము. కొలఁదిగజములదూరముననే చండాలకులజ యగునొకశిశు వుండెను. అయ్యది యాయున్మత్తవారణంబును వీక్షించి పరుగులిడు జనులసంభ్రమంబున పితృభుజచ్యుత యయి యప్పు డాజంతువుయొక్కపాదము లక్రిందఁ బడి నలిగిపోవుటకు సిద్ధముగా నుండెను. రాజపుత్రుఁ డది యెల్లఁ గాంచి యాపసికూనను రక్షింపవలె నని యెంచెను గాని యయ్యది హీనకులసంజాత యగుటయు, తాకినంత మాత్రమున మయిలపడిపోవుదు నేమో యని సందియ మందుచు నేమి చేయుటకును దోచక డోలాయమానమానసుఁ డై యుండెను. ఇంక నేమాత్ర మాలస్య మైన నాశిశు వీలోకపుఁబొలిమేరల దాటుచుండుట ధ్రువము. ఇట్లాతఁడు సంశయించుచు నిలువంబడి యుండఁగా, స్ఫురద్రూపి యైనయొక్కఁ డొకభవనముయొక్క పైయంతస్తునుండి దుమికి రోషావేశ యై యున్నయాజంతువును గదాతాడితం జేసి దానిం బోఁద్రోలెను. ఈఘనకార్యాచరణ మయినపిదప నాసాహసుఁ డాపసిపాపను దనశిశువునుంబలెనే చంకఁ బెట్టికొని నిరపరాధియు నిష్కపటియు నైనయొక్కమానవవ్యక్తిని నిశ్చయమనుకొనినమృత్యువునుండి తప్పించఁ గలిగితిని గదా యని పరితుష్టహృదయుఁ డయ్యెను.

మంగళసేనుఁ డాశ్చర్యపరివేష్టితుఁ డై నిలువంబడియుండెను. ఆచండాలకులజ యగుశిశువును దాత్కాలికమృత్యువునుండి రక్షించినది విదేశీయరాష్ట్రమునకు ముఖ్యుఁ డైనవాఁడును తనపితృవధయందు మిగుల సహాయభూతుఁ డైనవాఁడును దక్క యన్యుఁ డెవ్వఁడును గాఁడు. మొట్టమొదట నాతనిని దనకై జారుతోఁ బొడువఁ జూచెను గాని తాను రాజపుత్రుఁ డగుటచే సద్భావసంపూరితుఁ డై యట్లొనరింప నిచ్చగింపలేదు. పిదపఁ దనకటిబంధనినుండి కృపాణము నూడఁ బెరికి యాగ్రికునియొద్దకుఁ బోయి "ఈకరవాలమును బరిగ్రహింపుము. ఇయ్యది యింతవఱకుఁ ద్వదీయరుధిరపానంబునకుఁ దృషితార్త యై యున్నది. కాని నీసత్య మైనయౌదార్యమే నాచేతులనుండి నిన్ను రక్షింపఁగల్గినది. నాతండ్రి నన్యాయముగఁ జంపిననీకు ప్రతీకారం బొనరింపకమున్నే నీవు నాకుఁ జేయఁ గల్గినచెఱుపును జేయుము. అట్టిచో లోకము నన్ను భీరుఁ డని పిలువకుండును." అని నుడివెను.

ఆనాయకుఁడా చంద్రహాసమును గ్రహించి యాపిన్నవానిం గాంచి "ఓయీ! మంగళసేనా! ఎందుల కిచ్చటి కేతెంచితివి? గ్రీకులు నీకు ప్రకటశత్రువులు గదా! త్వదీయాన్వేషణార్థమయి చారులు నానాముఖములఁ బంపఁబడియున్నారు. వారలు నీమరణముతోడం గాని సంతృప్తి చెందువారలు గారు. నీసాహసమునకు మెచ్చితిని. కాని కొన్నికొన్ని కారణములవలన నీస్థలమును సత్వరమున వీడి యెటకేనిఁ జనవలసిన దని నీకు ప్రబోధించుచున్నాడను. లేనిచో నీవు కొన్నిషరతుల కంగీకరించు నెడల నీపక్షమున వాదించి ని న్నీవిపత్తునుండి దరి జేర్చెదను." అని వచియించెను.

మంగ—అయ్యా! మీర లెఱుంగుదురు కదా! నే నుత్తమక్షత్రియుఁడను. మీషరతులు లాఘవకరములుగ నున్నచో నీపరిభవావమానములపాలం బడుటకన్న మరణమే నా కుత్తమోత్తమము. మూఁడుసంగతులు కలవు. అవి నాకు తృప్తికరముగఁ బరిష్కరింపఁబడు నెడల మీ రీవఱకు నాకుఁ జేసినయుపకారముల నెల్ల మఱచిపోయెదను.

నాయ—అవి యెవ్వి?

మంగ—నాప్రజలకు స్వాతంత్ర్య మొసఁగుట మొట్టమొదటిది. నాపితృఘాతకుని నాకు సమర్పించుట రెండవది. మూఁడవది మీరలే యెఱుంగుదురు కదా!

నాయ—మూర్ఖుఁడా! విదేశీయపరిపాలనమును దిరస్కరించెదవా? అట్లయినచో నీతో మాటాడుట వృథాకాలయాపన మొనరించుటయే. నీవు మారక్షణక్రింద నుండుట కంగీకరించినచో నీ కేదైన నుపకృతి యొనరింపవచ్చును. కాని యట్టి యాశ యెద్దియును లేదు. కాఁబట్టి నీ వెంతత్వరితముగ నీయూరు దాటిన నీ కంత మేలు. తిరిగి యీఖడ్గమును గైకొనుము. ఈపట్టణమున నిన్ను నమ్ముకొని యుండకుము."

ఆప్రకారమే యాపిన్నవాఁడు తనయాయుధమును దిరిగి పుచ్చుకొని యానాయకుఁడు మిత్రాశ్రితపరివృతుఁడు కాకమునుపే యాస్థలమునుండి తరలిపోయెను.

# మూఁడవ ప్రకరణము.

ప్రపంచవృత్తమునందు స్త్రీయే ముఖ్యోపకరణముగా నున్నది. దాదాపుగ నన్నిమార్పులు, నన్నిపరివర్తనములును స్త్రీజాతివలననే వచ్చుచున్నవి. యథార్థముగ నామె రాణి యని నుడువవచ్చును. మానవునియొక్క హృదయమే యామెపీఠము. ఆమె యన్నిఁటికిని స్వామిని యై యున్నది. ఆమెయధికారమును గాదని యెవ్వరును వాదింపఁజాలరు. ఏదేశమునందు ఋజుప్రవర్తన లైనట్టియు, జ్ఞానోద్దీపితమానస లైనట్టియు స్త్రీరత్నము లుందురో, యాదేశము ధన్య మైనది! సౌఖ్యభాజన మైనది! ఏల ననఁగా నయ్యది క్రమక్రమముగా నభివృద్ధి పొంది నిశ్చయముగ నుచ్ఛదశఁ దాంచ గలదు. స్త్రీజాతియొక్క పవిత్రప్రభావమే యొక దేశమునందలిప్రజలను నున్యవస్థలో నుంచుటకు నిజమైనసాధన మై యున్నది. "ఎంతకాలము మానవులు తమస్త్రీరత్నములను గౌరవించి వారితోఁ గలసిమెలసి పని చేయుదురో, యంతకాలమును వారలు పరాజితులుం గాఁజాలరు." అని గౌతమబుద్ధుఁడు వచియించియున్నాఁడు.

మంగళసేనుని జీవితమునందును, రాజకీయవ్యవహారములయం దతఁడు పన్నిన పన్నుగడను పెంపొందించుటయందును బ్రక్షిప్తమై యున్నస్త్రీప్రభావము స్మరణార్హ మైనది.

"ఈపట్టణమున నిన్ను నీవు నమ్ముకొనియుండుట క్షేమము కాదు." అని యానాయకుఁడు చెప్పెను. ఆసంగతి మంగళసేనున కాతఁడు చెప్పినదానికన్న బాగుగఁ దెలియును. గూఢచారు లతనిని వెదకుటకుఁ బంపఁబడియుండిరి. అతనిని, నతనినివాసమును గనుఁగొనుటకు శక్తివంచనలేకుండ ప్రయత్నములు జరుగుచున్నవి. కాని మానవజాతికి స్వాభావిక మగుమనోదౌర్బల్య మతనికడఁ గూడ నుండుటచే నాసింహగహ్వరంబున నిలచి యుండుటతనకొం కెదురుమూమున్న యాపదకు సహకారి యని యెఱింగియు, నింతదనుక మానసారాధనం గావించుచున్నవస్తువును గన్నులార నొక్కపరి యైన నవలోకించి కాని యచ్చటినుండి చనుట కాతనికి మనసొప్పినది కాదు. వైరినిఁ దనచేతులనుండి తప్పించుకొని పోనిచ్చితిఁగదా యని యతఁడు విచారపడకపోవుటయే కాక, యాసంగతి యట్లు జరుగు

టయే సమంజస మని కూడ తలంపఁ జొచ్చెను. అట్లే జరుగనియెడల నాతఁ డిప్పుడు చేయఁ దలఁచుకొనినపని యెల్ల ధ్వంస మగుటయే కాక, యాతనిహృదయపీఠము నాశ్రయించి యున్న నారీరత్నమును గలసికొనుసౌఖ్యము కూడ బహుశః యాతనికి దొరకియుండక పోవును.

ఒకానొకదివసంబున నాతఁ డూరక నిటునటుఁ దిరలాడుచు, నొకసుందరోద్యాన వనమునకడనుండి పోవుట తటస్థించెను. తోడనే లోని కరిగి కొలఁదినిముసములవఱకు సౌఖ్య మనుభవింత మనుకోర్కె యాతని కుదయించెను గాని యాతోటమాలి లోనికి రానీయకుండ నవరోధించుటంజేసి యతఁ డీవలనే నిలువవలసివచ్చెను. అయిన, నాయా రెడల పరుసలు తీర్చి యందమున కందము నించుచందమున నందలివృక్షములను నాటిన నేర్పరితనమును, పూచినపుష్పభారముచే వంగి మెల్లమెల్లన వీచుమందమారుతమున నల్లల నాడుచు నుల్లంబున నుల్లాసంబును సంఘటిల్లం జేయు వల్లికామతల్లులవిలాసమును, నీవల నిలువంబడియే చూచుచుఁ దనకందామరలకు విందొనర్చుకొనుచుండెను. చెంత నున్న మహీరుహంబుల వరించి, తమంతఁ దాము సుఖపడుటయే కాక తాము చేపట్టినపాదపము లకుఁ గూడ సౌఖ్యవైభవముల నాపాదించువల్లికాతల్లజంబులయందును, దోరగ పండఁ బారినఫలములఁ దమచంచుపులం బొడిచి మెక్కుచు నడుమనడుమ ముక్కును ముక్కును గలుపుకొనుకీరదంపతులయందును, విడివిడి మొలక లైన నొకకేతులమునందలివానిం దెచ్చి యొండొంటిని గలిపి కట్టినయంత శాఖాభేదమును పాటింపక మనసును మనసును గలిసి నవనవలాడుచు గుబురుగాఁ బెరిగి మధురఫలముల నొసంగునంటుమావిగున్నలయందును, వేయేల? తుద కాకలకలలాడునుపవనలక్ష్మియందును గూడ పవిత్రతయే యతనికిఁ గరత లామలకంబుగఁ గాన్పింపఁ జొచ్చెను. దానిని వీక్షించుచు నెడనెడ, "నేనును నామనో హారిణియు నాలతొకుబంబులంబోలె పవిత్రానురాగబద్ధులమై యాకీరదంపతులదాంపత్యంబు చొప్పు మీఱి, యాయంటుమావిగున్నలవలె మనసును మనసును, నూహలు నూహలును గలిసి వనలక్ష్మి కైవడిఁ గలకలలాడుచు సంతోషనీరధి నోలలాడుదు మెక్కొ?" యని తలపోయుచు వచ్చెను.

ఇట్లొక్కింతతడవ వచ్చట నాగి, యటనుండి వెడలిపోవుటకు సిద్ధముగ నుండ, నొకయువతి యతనిని లోనికి రమ్మని పిలిచెను. ఈతరి నాతోటమాలి యాతని నాటంకపఱచలేదు. తనవేషము ననుసరించి హీనకులజునిభంగిఁ గాన్పించుటంజేసి యాయుపవనాధిపుని కెయ్యదియో పరిచర్య జేయించుటకె తన్నుఁ గొనిపోవుచున్న దని మంగళసేనుఁడు తలంచెను. ఆయువతియు నుద్యానమధ్యమున నున్నయొక సుఖకరమైనశిలాగృహాంతరమున కాతనిం దోడ్కొనిపోయి, యొక్కెడఁ గూర్చుండి యించుకసేపు వేచియుండవలసిన దని చెప్పెను. మంగళసేనుఁ డీయద్భుత మేదియో బోధపడక యాలోచించుచుండెను. మొట్టమొదటఁ దన కెయ్యదియో యాపద రానున్న దేమో యని భయాన్వితుఁ డయ్యెను గాని యాతరుణి చేసినసత్కారంబునుబట్టి యాతరుణంబున నెవ్వొందఁ గారణంబు లే దని యనుకొనెను.

ఇట్లనుకొనుచుండఁ, బదునేడు పదునెనిమిదివత్సరములప్రాయము గలయొక మనోహరరూపిణి యట కేతెంచి తేనెసోనలం గురియుచున్నసుభాషణంబుల "ఏమి? ఇచ్చటి కేల వచ్చితిరి?" అని యాతనిం బ్రశ్నించెను. అప్పుడు మంగళసేనుని యాశ్చర్యమునకుఁ బారము కానరాకుండెను. తనభాగ్యములపంటయో యన, నాకస్మికముగఁ దనకడ కరుదెంచి, తనతోడ సంభాషించుచున్న స్త్రీ గ్రీకునాయకుని పుత్రిక యై యుండ, నాతఁ డాశ్చర్యనిమగ్నుఁ డయ్యె ననిన వింత యేమి కలదు? అతఁ డప్పుడు సంభ్రాంతుఁ డై యడిగినదానికిఁ బ్రత్యుత్తరముగ నేదియో కొంత గొణగవలెనని చూచెను గాని యట్లొనరించుటకుఁ గూడ ధైర్యము చిక్క దయ్యెను. ఆయుత్తరక్షణంబున నాతఁడు తనప్రియాపార్శ్వంబున నిలువంబడెను. అంతట వా రిరువురు నొండొరులం గౌఁగిలించికొని యొకరిప్రక్క నొక రధివసించిరి.

పిమ్మట నాతఁడు తనకుటుంబమునకు వాటిల్లినవిపత్తును, వా నట్టిహృదయవిదారణం బగునవస్థకు వచ్చుటకుఁ గలకారణమును నామెకుఁ దెల్పి "నాజీవితదిక్చక్రం బంతయు జలధరాక్రాంత మై యున్నది. మందద్యుతిని రాల్చుచు చిత్తంబునుం బల్లవింపం జేయుచున్నయాశానక్షత్ర మొక్కటి మాత్రమే కలదు. అది కూడఁ గాన్పించనిచో నామనోరథము లన్నియు భగ్నము లై యీపాటికి జీవచ్ఛవంబ నై యుండవలసినవాఁడను." అని చెప్పెను. 'కొరోనియా' యభిదానంబునఁ బరగునామె "ఎందులకు? అంత నిరాశ లగుట యేల? రాజపుత్రు లెల్లరు మీవలెనే యున్నారా? లేక వారు సంభాషించువిధ మిట్టిదా?" యని వచించెను. మంగళసేనుఁడు సిగ్గుపడి యేమ్మో

మాటాడుద మనుకొనుచుండ, నాతనిమనోహారియే తిరిగి సంభాషణ కుపక్రమించి యిట్లనెను. "ఈప్రపంచమున మానవులజీవితమునందలిసంగతు లన్నియు నేవి యెట్లు జరుగవలెనో యిదివఱకే సర్వశక్తుఁడైన పరమేశ్వరునిచే నిర్ణయింపఁబడి యున్న వని మీరలే యెఱుంగుదురు. అంతయు నాసర్వజ్ఞునిసంకల్పమును నుద్దేశము ననుసరించి జరుగుచున్నది. ఆమహామహునిహస్తంబుల నీనరకీటకము లెంత? ఆయన యేమి చేసిన నది మన క్షేమముకొఱకే. అల్పజ్ఞుల మగుమన కాసర్వజ్ఞునియుద్దేశములు తెలియరావు. ఈమర్త్యలోకంబున సుఖదుఃఖములు రెండును మిశ్రీకృతములై యున్నవి. ప్రత్యేకముగ నొక్కసుఖమునకే యాశించుట గగనకుసుమంబున కాశించుటవంటిది. మానవుఁడు తనకల నైన దుఃఖమిశ్రితము కాని సుఖమును గన్గొనఁ జాలడు. సౌఖ్యము నభిలషించెడు వారు మధుకోశము నాశ్రయించికొని మధుపంబు లుండు ననియు, గులాబికుసుమంబులకు గంటకము లుండు ననియు మున్ముందు తెలిసికొనవలసియున్నది. కావున నధైర్యపడుట పురుషలక్షణము కాదు. ఉత్సాహవంతులు కండు. అట్లయిన మీకోర్కెలు కూడ సఫలము కావచ్చును.— కొలఁదినిముషములవఱకే కాని మీతో నంతకన్న నెక్కుడు కాలమును గడపుటకు నా కనుజ్ఞ లేదు. ఈసమాగమ మైన నాతల్లియొక్కతంత్రమువలన సమకూరినది. మనసంగతి యెల్ల నామెకుఁ దెలిసినట్లు మీ రెఱింగియే యుందురు. మాతండ్రి మీకును నాయునకును జరిగినయుదంత మంతయు నామెతోఁ జెప్పియున్నాడు. అందుపై నామె నాపై జాలి నొంది నేను మిమ్ముల నొకమారు చూడవలె నని యభిలషించెను.

చంద—ఈసంగతినిగుఱించి వారియభిప్రాయము లెట్లున్నవో యని నే నడుగవచ్చునా?

రోహి—మన వివాహవిషయమై మాతల్లి కేమియు నభ్యంతరము లేదు. 'మీకుమార్తెయొక్క సౌఖ్యము నించుక యాలోచింపవలసిన' దని యామె మాతండ్రికి బ్రబోధించుచునే యుండును. కాని వారిమంత్రులును మిత్రులును మాత్ర మెవ్వరో బూటకపుటాటంకములను దెచ్చిపెట్టుచుందురు. వారివలెనే మీక్షత్రియులు కూడ మాననీయ మగుజాతి యని యెఱింగియున్నను బూర్వ మిట్టిసంబంధబాంధవ్యములు లే వని వారలు చెప్పుచుందురు. ము న్నెన్నఁడైన నిట్టిసంబంధము లుండె నని మీరు వక్కాణింపఁ గలరా?

మంగ—హిందువులకును గ్రీషియనులకును ము న్నీవిధ మగువివాహసంబంధము లుండెనేమో కొంచెము విచారించి నీకుఁ దెలియఁజేసెదను.

ఈయల్పకాలసంభాషణము ముగిసినపిదప వారిరువురు నొండొరుల వీడిరి. కొర్నోనియా లోనికిఁ బోయెను. అంతట మంగళసేనుని మొట్టమొదటఁ దోడ్కొనివచ్చిన దాసి తిరిగి యాతనిం గొనిపోయి యాపుష్పవాటిక కావల దిగవిడచెను.

## నాల్గవప్రకరణము.

పూర్వకాలమం దొకానొకప్పుడు హిందూదేశమునందలి మగధరాజ్యము ప్రబలమై యుండెను. ఒకప్పుడు రాజపుత్రాన్వయు లగుపురుశాఖలోనివారలు దానిని బరిపాలించి యుండిరి. ఈవంశమునందలిజరాసంధుఁడు మొదలగువారలు హిందూదేశ చరిత్రపాఠకులకు బాగుగఁ దెలిసియే యుందురు. ఈరాజ్యమునకు పాట్నా ముఖ్యపట్టణమై యుండెను. సంస్కృతవాఙ్మయమున నీపట్టణము పాటలీపుత్రము లేక పుష్పపురి యని పిలువఁబడుచున్నది. గ్రీషియనులు దీనినే పాలిబోత్రినామమున వ్యవహరించి యున్నారు. మొట్టమొదట నిచ్చటనే గౌతమబుద్ధుఁడు తనమతధర్మములను బోధించి యున్నాఁడు. ఈస్థలమునుండియే యార్యధర్మవ్యాపన సేయుకొఱకు సయామ్, ఏనామ్ బర్మా, సింహళము మున్నగుదేశములకు బౌద్ధమతబోధకులు పంపఁబడియుండిరి.

కాని యీలోకమున నేదియు శాశ్వతముగ నిలిచి యుండునది కాదు. మనకుఁ గాన్పించున వెల్ల క్షణభంగురములు. ఒకప్పు డురువిక్రమముచే నొప్పినపురుకులము నందవంశముచే సింహాసనభ్రష్టము గావింపఁబడెను. ఈనందవంశపురాజులు దాదాపుగ హిందూదేశము నంతను బరిపాలించియుండిరి. వారిరాజ్య మాసేతుశీతలాచలపర్యంతము వ్యాపించియుండెను.

నందవంశము మగధరాజ్యమును నూటముప్పదియెనిమిదివత్సరములవఱకుఁ బరిపాలించె నని చెప్పెదరు. మహానందుఁడు ఆవంశపువారిలోఁ గట్టకడపటివాఁడు. ఆతనివలెఁ బ్రజానురంజకముగఁ బరిపాలన మొనరించి నశించిపోనికీర్తిని సంపాదించినవాఁడు మఱియొకఁ డుండఁ డని చెప్పవచ్చును. హిందూదేశమునం దన్నితెగలవారు నాతని సాహసకార్యంబులను పరాక్రమకృత్యంబులను జాలకాలమువఱకు సంకీర్తించుచుండిరి. ఈదేశము నలెగ్జాండరు దండెత్తివచ్చినప్పు డాతఁడు మగధరాజ్యమును గూడ జయించవలె నని యభిలషించెను కాని మహానందునిబలాధిక్యతయు, నాతనిశౌర్యప్రతాపముల నాలకించి యాతనితోడ వచ్చినగ్రీషియనులు నిరుత్సాహులై యలెగ్జాండరెన్నివిధముల ధైర్యము చెప్పి వారిని బురికొల్పినను, వారు ముందున కొక్కయడుగైనఁ బెట్ట సాహసింపరైరి. ఆమగధాధీశుఁ డంతటిపరాక్రమవంతుఁడు.

మహానందునకు శక్తారుఁడు, రాక్షసుఁడు ననునిరువురుసచివులు కలరు. అందు మొదటివాఁడు కాయస్థుఁడు; రెండవవాఁడు బ్రాహ్మణుఁడు. ఆసచివు లిరువురును బరస్పరద్వేషములం బెంచికొని నిరంతరము నొకరితో నొకరు కలహించుచుండువారు.

ఒకానొకప్పుడు రాక్షసప్రోత్సాహంబున మహానందుఁడు తనద్వితీయమంత్రిని నాతనికుటుంబములోనివార లందఱితోడఁ గారాగృహంబున నుంచెను. తద్గృహాధికారులు కూడ నిర్దయులై వారికి గుప్పెడుమంచినీళ్ళను పట్టెడన్నమును మాత్రమే యిచ్చుచు వారిని ఘోరములైన క్రూరహింసలపాలు సేయుచువచ్చిరి. దానంజేసి శక్తారుఁడు తప్ప మిగిలినవార లెల్లరు నాచెఱసాలయందె తమయసువులం దొఱంగిరి. తనకడగొట్టు కుమారుఁడు కడయూపిరి విడుచుసమయంబున శక్తారుఁడు, రాజకార్యమువలనఁ దన తనూభవు లొకరితరువాత నొకరు చనిపోయినందున చండశాసనుఁడైనయామహారాజు కూడ నెప్పుడో యొకప్పుడు తనపుత్రనష్టంబునకు వగచి తనయకార్యమునకుఁ బశ్చాత్తాపము నొందునట్లు తగినప్రతీకారం బొనరించి పగ సాధించెదను గాక యని శపథము పట్టెను. చాలకాలమైనపిదప మహానందునిపరిచారికయొక్క సామర్థ్యమున శక్తారుఁడు కారాగృహమునుండి విముక్తుఁ డయ్యెను. ఒకానొకప్పు డాజనపాలుఁ డొకస్వప్నమును గాంచె ననియు, నప్పుడు దానిఫలిత మిట్టి దని యెవ్వరును నిరూపించనేరరై రనియుఁ బిదప నాతనిపరిచారిక యొకర్తు స్వప్నఫలితముల నెఱుంగఁ జెప్పుటయందు శక్తారుఁ డద్భుతశక్తి కలవాఁ డని రాజునకు విన్నవించి యాతనిం బిలువనంపు మని కోరె ననియు,

నటుపిమ్మట నామహారాజాయన మానితుననుగౌరవసూచకంబుగ నమూల్యవసనంబులం గొన్నింటి నంపి యాతనిం జెఱనుండి విడిచిపుచ్చు మని కారాగృహాధికారుల కాజ్ఞ చేసె ననియు, నీవిధమున నే మహానందునిపరిచారిక కారాగారస్థుం డగుశక్తారుని విడిపించె ననియుం జెప్పుదురు. శక్తారుండు కారాగారవిముక్తుం డైనపిదప నమ్మహారాజునకు స్వపాప్తార్థమును బరితృప్తికరంబుగ వివరించి చెప్పుటంజేసి, యాభూమీశుండు తిరిగి యాతనిమంత్రిత్వపదవి నతని కొసంగెను. కాని శక్తారుండు పూర్వముకన్నం జాలగ మాఱిపోయెను. కారాగృహమునం దతం డనుభవించినవేదనయు, నప్పుటం బొందిన క్రూరాదరణయు నాతనిని నిజ ముగు రాక్షసునిగ నొనరించెను. విషపూర్ణ మైనద్వేష మును హృదయదాహం బొనరించువిరోధంబును నాతనిచిత్తంబునం జుట్టుముట్టి, రగులు చున్నక్రోధాగ్నినిం బ్రజ్వలింపం జేయుచుండుటచే నాచెఱనుండి విడుదల చేయఁబడి నప్పటినుండియు బోనునుండి వెలువడినసింహముమాడ్కి శక్తారుండు రోజుచు నమ్మహా రాజుపైం బగ సాధింపనే మామమండెను. చంద్రగుప్తునిచరిత్రమునందు ముఖ్యపాత్ర మును గైకొనినట్టియుం, బైనం జేర్కొనినపరిచారికయొక్క ప్రయత్నంబులం జేఁదో డైనట్టియు విష్ణుగుప్తచాణక్యుం డనునొకబ్రాహ్మణుం డతనికి సాహాయ్య మయ్యెను. పిదపం గొలఁదిమాసంబులలోనే మహానందుఁడును నాతని తొమ్మండ్రుగురునందనులును నాసచివప్రతిద్రోహంబున విగతజీవు లైరి. ఔరససంతానం బెద్దియు మిగులకపోఁగా, మగధసింహాసనమునం జంద్రగుప్తు నెక్కించవలసిన దని చాణక్యుని కుపదేశించి శక్తారుం డాత్మహత్యం గావించికొని దేహయాత్రం జాలించెను.

నందవంశీయులమరణము శక్తారునిప్రతిపక్షి యైనరాక్షసుని కనేకవిధముల లోప ముగ నుండెను. చాణక్యుఁడు చంద్రగుప్తునికిం బట్టాభిషేక మొనరించినప్పుడు రాక్ష సుఁడు సభాభవనమునుండి నిర్వేదముతోం దొలంగి, పశ్చిమదేశంబుల కేగి, యాధరణీ రమణుల నెల్లర నొక్కటిగాం గూడి మగధరాజ్యముపై దాడి వెడలివచ్చి యట్టియవ మానకర మగుద్రోహము చేసినందులకు చాణక్యుని శిక్షించవలసిన దని ప్రోత్సహించుచు వచ్చెను.

కాని చాణక్యుం డసాధారణుఁడు. రాజనీతినిపుణులలో నెన్నికం గన్న యాతఁడు తన్ను పరిరక్షించుకొనుట యెట్లో యెఱింగియుండకపోలేదు.

అతఁడు తనపైఁ బన్నఁబడుపన్నాగముల నెల్లఁ గన్గొని భగ్నము సేయుచుండుటచే రాక్షసుఁడు కాని మగధయం దున్నయాతనిమిత్రబృందము కాని యతని కపకారలవం బైన నొనరింపఁ జాలకపోయిరి. చంద్రగుప్తునిబాగుకొఱకు, నతనిపరిపాలనకొఱకు చాణక్యుఁ డెట్లు పని చేసినదియు ముద్రారాక్షసం బనుప్రశస్తసంస్కృతనాటకంబున విరివిగా వివరింపఁబడి యున్నది గాన నది యెల్ల మరల నిటఁ దెల్పుట యనావశ్యకము.

చాణక్యునిదూతలు కూడ రాక్షసునివలెనే సింధు, పాంచాల, కాశ్మీర, మలే, కేలట్, పారశీక దేశాధినాథులం దర్శించి వారితో సఖ్యంబు నెఱపిరి. వారలసాహాయ్యంబువలననే చాణక్యుఁడు తనయాప్తవర్గముతో రాక్షసుఁ డొనరించుకపటకృత్యంబుల రూపు మాపఁ గల్గెను. స్వశక్తిసామర్థ్యంబులవలన నున్నతపదవి నారోహించి మన మంగళసేనుఁడు కూడ మగధయం దున్నచాణక్యుని కాలోచనఁ జెప్పువారలలో నొక్కఁడయ్యెను. మంగళసేనునిశ్రమసమాయుతప్రయత్నములవలనను, నతనియసమానమేధాశక్తివలనను మగధదేశము విప్లవంబు లెవ్వియును లేక నిస్సంక్షోభిత మై యుండెను.

## అయిదవప్రకరణము.

మంగళసేనుఁడు ప్రజలచే మిక్కిలి ప్రేమింపఁబడుచుండువాఁడు. గొప్పవార లైనఁ గొలఁదివార లైన, ధనికు లైన నిరుపేద లైన నందఱు నతనినిఁ బ్రేమించియుండిరి. అందువలన నాతనిస్వదేశనిర్గమనము వారిగాఢవిషాదమునకుఁ గారణ మయ్యెను. అతఁ డెచ్చటి కరిగెనో వార లెఱుంగరు. అతనిమిత్రు లాతనికొఱ కందందు విచారించిరి కాని సఫలీకృతప్రయత్నులు కాఁజాలకపోయిరి. వారి కాతనివియోగము దుస్సహ మై యుండెను. అతఁడు శత్రువులచేతం జిక్కె ననియుఁ, దనతండ్రివలెనే యాతఁ డా నరాపసదులచే హతుఁ డయ్యె ననియు, జీవప్రపంచమునం దతఁ డింక లేఁ డనియుఁ దుట్టతుదకు వారలు నిశ్చయించుకొనిరి. కాని తమ్ము ఘోరతాకార్యములబారినుండి తప్పించునుపాయముల నెమకుచుండె నని పాప మమాయకులు వార లెఱుంగరు.

మంగళసేనుఁడు సాధారణుఁడు కాఁడు. అతఁడు మగధయందు రాజసానుచరులహృదయములఁ బ్రశాంతములుగ నొనరించి, పంజాబునందు విదేశీయులపైఁ గుట్రలు పన్నుచుండెను. అచ్చటఁ దనయభిప్రాయములతో నేకీభవించినప్రముఖు లనేకులు కలరు. గ్రీషియనులచేష్టితము లంతకంతకు దుర్భరము లయ్యెను. వారిదర్పమును, రాజ్యలోభమును వేరుపురుపు లై వారిజనానురాగలతను క్రమక్రమముగా రూపు మాపుచుండెను. లోకు లెల్లరు గ్రీషియనులను ద్వేషించుచుండుటచే మంగళసేనునిపరిజను లదియు కా తగినతరుణం బని తలంచి, తమపై నున్న మహాద్భార మించు కైన గుర్తెఱుంగక నిద్రించుతమతోడిహైందవులను మేల్కొలిపి, తమ దేశమును బారతంత్ర్యమునుండి విడిపింప రావలసిన దని ప్రోత్సాహపఱిచిరి.

గ్రీషియనులును దమ్ము వెడలఁగొట్ట దేశీయులు చేయుచున్నప్రయత్నముల కనభిజ్ఞు లై యుండలేదు. కాని యవసరము కలిగినప్పుడు తమదేశము తమకు తప్పక తోడ్పడు నని వారలు దృఢాభిప్రాయు లై యుండిరి. కాఁబట్టి యవిలంబితసాహాయ్యము నపేక్షించి సందేశహరులు గ్రీసుదేశమునకుఁ బ్రతిక్షణమున కొక్కొక్కరు చొప్పునఁ బంపఁబడుచుండిరి. ఇట్లు కొంతకాలము గడచినతరువాత అలెగ్జాండరుయొక్క సుప్రసిద్ధసేనాని యగు సెల్యూకస్ నికేటార్, వారిసాహాయ్యార్థ మరుదెంచెను. అలెగ్జాండరు బలవంతుఁడును, వివేకవంతుఁడు నగురాజని యౌన్నత్యఁ గాంచెను. కాని యతనితరువాత సింహాసనమున నధిష్ఠింప నతనికి సంతానము మాత్రము లేక పోయెను.

అతఁడు చనిపోయినపిమ్మట నతనిరాజ్యము నతనిసేనాధిపతులు పంచికొనిరి. అట్టివారలలో సెల్యూకస్ ఒకఁడు. క్రీ.ము. 321-వ సంవత్సరమున నాతఁడు బెలోనియాదేశమునకు గవర్నరయ్యెను. అతఁడు క్రమక్రమముగాఁ దనకును దనవైరులకును జరిగినపెక్కుయుద్ధములలో విఖ్యాతుఁడయ్యెను. క్రీ.ము.312-వ సంవత్సరమునఁ దనశత్రువులఁ బరాజితులం జేసి తానే యాయలెగ్జాండరునిసింహాసనమున కుత్తరాధికారి నని ప్రకటించెను.

అతనియశ స్సత్యుచ్ఛదశయం దున్నప్పుడు హిందూదేశమునందు జరుగఁబోవుచున్నవృత్తాంత మాతనికి దెలియవచ్చెను. పిదప నాదేశమును గూడ జయించి తనరాజ్యము నింకను నభివృద్ధిపఱచుతలంపుతో నతఁడు హిందువులపై జైత్రయాత్రకు వెడలెను.

# ఆఱవ ప్రకరణము.

---

చంద్రగుప్తునికొలువునం దొకవత్సరము పని చేసినపిదప మంగళసేనుఁడు సెలవు తీసికొని పంజాబున కచ్చటిసంగతు లెట్లు జరుగుచున్నవో తనకన్నులార వీక్షింప నేఁగెను. తనసహచరులయందును, సహోద్యోగులయందు నతనికి సంపూర్ణవిశ్వాసము కలదు. అయినను వారల కొక్కపరిఁ గాన్పించి విదేశీయులతోడిరణ మొనరింప సంసిద్ధము కండని హెచ్చరింపఁ గోరెను. ఈయుద్దేశముతో నాతఁడు పెషారము మొదలు జీలము వఱకుఁ బ్రయాణ మొనరించి మార్గమధ్యంబున నున్నముఖ్యస్నేహితులం గలిసికొని, యావశ్యక మగుసంగతుల నెల్లఁ దెలిసికొనెను.

తరువాత గూఢచారి యై శత్రువులచర్యలం గనిపెట్ట నతఁడు బుకేఫలమున కరిగి మార్గస్థు లంతగ వచ్చుట వాడుక లేనియొకసత్రంబున బస చేసెను. ఒకనాటి రాత్రి యతఁడు తనగదియందు నిద్రించుచుండ నాసత్రమం దున్నయితరుల కేకలవలనను, పరుగులచప్పుడులవలనను నులికిపడి లేచి, సంగతి విచారించఁ బట్టణమునం దెచ్చటనో నిప్పంటుకొనె ననియు, గొప్పగొప్పభవనములు తగులఁబడిపోవుచున్న వనియు నతనికిఁ దెలియవచ్చెను.

భవనములు తగులఁబడిపోవుచున్న వనుమాట వినినంత నింక నచ్చట నిలువ నోపక చటపటధ్వనులును, సందడియును వినవచ్చుదిక్కు ననుసరించి పోయి చూడ, నది వెనుక గ్రీకునాయకుఁడు సాహసకృత్యమును బ్రదర్శించఁ దాను గన్గొనినముఖ్యవీధి యై యుండెను. అచ్చట నెల్ల గందరగోళముగను, గడబిడగ నుండెను. అప్పుడు భీషణ జ్వాలల వెలిఁ గ్రక్కుచునాయగ్నిహోత్ర మార్పఁ బ్రయత్నములు జరుగుచుండెను. కాని యురక లిడుచు క్షణమున కొకక్రొత్తయింటి నంటించుచున్నయాయగ్ని నార్ప నెవరిశక్యము? చేరువ నాలుగుబారలదూరమున నిలువంబడుటకుఁ గూడ దుస్సాధ్య మయ్యెను. దాని నార్పువిధముఁ గానక యెల్లరును బరిపరివిధములఁ బరితపించుచుండిరి.

# ఆంధ్రరంగస్థలముల ప్రస్తుతస్థితి.

## ఉపోద్ఘాతము.

సంస్కరణ మత్యావశ్యకము. ఏవిషయమునైనను ఉన్నలోపముల నారసి వానిని తగినరీతిని దిద్దుకొనుట నెగడం దలంచువారికి నెల్ల సహజము. అట్లు సేయకుండుట అభివృద్ధికి ప్రతికూలము. లోపములు తెలియలేకున్నను, తెలిసియు వానిని దిద్దుకొనక పోయినను బాగుపడుట కష్టము. ఎందేని లోప మున్నదని యందరకు వెల్లడి సేయు వారు పైకి శత్రువులవలె కాన్పించినను, నిజముగా వారే మిత్రులు. ఒకమనుష్యుని యెడల నెట్లో సంఘముపట్టున అట్లే. సంఘములోనిలోపముల నారసి వాని దిద్దునుపాయముల సూచించువారు సంఘశ్రేయోభిలాషు లన దగుదురు. ఒకవేళ నభిప్రాయభేద ముండిన చర్చలమూలమున నిలకడపై నిజము తేలును.

మనప్రస్తుతసంఘస్థితిలో నొకదిక్కున కొన్నిలోపములు నాకు గనబడినవి. ఇట్టి లోపములు చాలమందికి తెలిసియున్నను ఎవ్వరును బహిరంగముగ చెప్ప నుత్సహింపరైరి నే నాపని బూనితి. మనసంఘమున ననేకవిధము లగునేర్పాటు లున్నవి. అందు కొన్ని విలాసార్థ మేర్పడినవి. ఇట్టివానిలో రంగస్థలములు ముఖ్యములు. వానివలన కేవల ముబుసుపోవుటయే కాక, మనోవికాసమును, నయప్రవర్తనయు జనుల కలవడును. ధన లాభము కూడ కొన్నిచోటుల కలదు. ఈమూలమున పరోపకారశీలత ప్రభవించు చున్నది. ఇన్నివిధముల నుపయోగకారు లగు రంగస్థలములయందు లోపము లున్నయెడల వాని సవరించుకొనుటకు నాటకసంఘములవారును, చూడబోవువారును, దేశాభిమానులు కూడ యత్నింపవలయును కదా! ఇట్టియుద్దేశముతోడ నే నీవ్యాసము వ్రాయ బూనితి. ఇది చదువువారు వీలున్నంతవరకు దీనిని ప్రచురము చేయుదు రని వేడుచున్నాను.

# సంగ్రహాచరిత్రము.

ప్రస్తుతమందు నెల్లెడల నాడబడునాటకములు మనదేశమం దనాదినుండియు నుండ లేదు. ఇవి రాకపూర్వము వీధినాటకము లనుయక్షగానము లుండెను. అవి యిప్పటికిని కలవు. ఇప్పటికి సుమారు నలుబదిసంవత్సరములక్రిందట మనదేశమునకు ధార్వాడనాటకులు వచ్చి ముఖ్యపట్టణములయందు వారినాటకములను ప్రదర్శించిరి. వీనికిని మనదేశస్థయక్షగానములకును విశేషతారతమ్యము కలదు. మనవీధినాటకముల యందు కర్రతో అలంకారములును, అరదళము మొదలగువానితో వేషములును తయారు చేయబడుచుండెను. తెరలు, దుప్పట్లు, రంగస్థలములందు బల్లలు తప్ప వేఱుపరికరములు లేవు. అన్నిరంగములను సభికులు భావించుకొనవలసియుండెను. గానము, నృత్యము, కథావైచిత్ర్యమును మెప్పు వడయుచుండెను. అభినయ మడుగంటెను. చేతులు ముఖమును త్రిప్పుకొనుటతప్ప రసప్రదర్శనము శూన్యమే. ధార్వాడనాటకమందు పలువిధము లయినతెరలు, పరికరములు, రంగములు, పాటలు నుండెడివి. భాష హిందీ. అది తెలియనప్పటికి మనవారందరు వీ లున్నంతవరకు చూచిరి; ఆనందించిరి.

పిమ్మట నానాటకముల బోలునాటకములు తాము కూడ వేయవలయు నను ఉత్సాహముతో నక్కడక్కడ నాటకసంఘము లేర్పడినవి. ఇందు జరిగింపబడుపనులు సాధారణముగా ధార్వాడకంపెనీని పోలియుండెను. తగుధనమును వ్యయపరచి నాటకవస్తుసంచయము కూడబెట్టి అది యొకవృత్తిగా భావించుకొనక యితరవిధముల జీవనోపాయము కలవారు నాటకములను ప్రదర్శించుచుండిరి.

ఇట్లుండ, 1890 సం॥ర ప్రాంతమున శాంగ్లీనుండి హిందీనాటకసమాజమువారే తెంచిరి. వారును ధార్వాడనాటకసమాజముతీరుననే ఏర్పాటు లుంచి, పరికరముల నభివృద్ధి చేసి, నృత్యము, గానము, పద్యములు, కత్తిసాము, పైరువర్క్, (underground lifts) మొదలగువానిని ఉపయోగించుచుండిరి. వీరిలో మంచిప్రదర్శకు లుండిరి. వీరు వేషభాషలచే చూపరులకు ఆహ్లాదము కలుగజేసిరి. వీరు గానము, గద్యము విశేషముగా నుపయోగించుచుండిరి. మననాటకము లాకాలమున నట్లే యుండెను.

పిమ్మట 1900 సం॥ ప్రాంతమున బళ్ళారివాస్తవ్యులు కీర్తిశేషు లగు ధర్మవరము కృష్ణమాచార్యులుగారు స్వకపోలకల్పిత మగు చిత్రనళీయమును అచ్చొత్తించిరి. అందు స్త్రీలకు గూడ పద్యములు చేర్చబడెను. వీనికి బదులు పాటలను కూడ రచించిరి. వీలునుబట్టి నాటకు లీరెండింటిని వినియోగపరుచుచుండిరి. ఈకాలమున మనదేశము లోనిపండితులు కొందరు సంస్కృతాంగ్లేయనాటకముల నాంధ్రీకరించిరి. అవి కూడ నక్కడక్కడ ప్రదర్శించుచుండిరి. ఇవి తప్ప తదితరనాటకము లచ్చొత్తింపబడవయి, ఏయూరివారికి చిక్కినదాటకముల నాయూరివారు ప్రదర్శించుచుండిరి. ఈనాటకములు గద్యపద్యాత్మకము లగుటచే పాటల నెవ్వరిచేతనో చేయించి పాడుచుండెడివారు. కొన్నిటియందు పాటలే లేవు. ఈసమయమునసే కొన్నిస్థలములలో హిందీనాటకములను, వేరుస్థలములలో సంస్కృతనాటకములను వేయుచుండిరి. వారిఆదాయమునుబట్టి వేష ములు, రంగసామగ్రియు కూర్చుచుండిరి. వీనియందు గానము, రసప్రదర్శనము ప్రాముఖ్యత వహించియుండెను. అట్టిసమాజము లిప్పుడు లేవు. తరుచుగా నన్నియు తెలుగుభాషనే ప్రదర్శించుచున్నవి. ఈకాలములో పాఠశాలలయందును, ఉత్సవసమ యములయందును కొందరు విలాసార్థము నాటకము లాడుచుండిరి.

గత 1910 సం॥ నాటికి ప్రతియూరను నాటకసమాజము లేర్పడినవి. వలసినంత ధనము వ్రియపరచి నాటకమునకు కావలసినతెరలు, దుస్తులు, తదితరసామగ్రియు పొందుపరచుచుండిరి. ఇచ్చట నొకవిశేషము కలదు. నాటకమందు స్త్రీపాత్రములు వేయువారు సంగీతము నెరింగియుండవలయు నన్ననిర్బంధ మొకటి వచ్చెను. ఇందునలన ప్రదర్శనశక్తి విలువ తగ్గినది. ఏల నన, సంగీతము సర్వజనాదరణీయము; అభినయమో అంతగా కాదు. ఇదెట్లున్నను, బాగుగ పాడ గలిగియున్నయెడ నా స్త్రీవేషధారిని అందరు మెచ్చుకొనుచుండిరి. ఇప్పటికి నాటకప్రదర్శన మొకవృత్తికింద నేర్పడినది. ఎల్లెడల ప్రదర్శకులు వెలువడిరి. ఎక్కడ చూచినను నాటకములే. పోటీచే నిక్కడివా రక్కడకు, నక్కడివా రిక్కడకు తారుమా రగుటకు వీలు కలిగెను. ఇందువలన లాభనష్టములగూర్చి వివారే యోచింపుడు.

# ఆంధ్రరంగస్థలములప్రస్తుతస్థితి.

మనరంగస్థలములప్రస్తుతస్థితి కొన్నివిషయముల శ్లాఘ్యముగను మరికొన్నివిషయముల నింద్యముగను ఉన్నది. మొదటివిషయము, రంగస్థలములయందు ప్రదర్శింపబడు నాటకములను వీధినాటకములతో పోల్చిన తెలియును; రెండవది, మననాటకములను ఇతరదేశములయందు వాడబడునాటకములతో పోల్చిన తెలియును. శ్లాఘ్యయోగ్యమగునంశము లేవన, దుస్తులు, తెరలు, సీనులు, గౌరవార్హమగు భాష గలనాటకముల వాడుటచే రంగస్థలములు పండితపామరులమనముల కాహ్లాదము కలిగించుచున్నవి. నిందాపాత్రమగునంశ మేదన, యితరప్రదేశముల ప్రదర్శకులు రాజగౌరవార్హులు, ప్రజారంజకులు, ప్రసిద్ధి గలవారు నగుచుండగా, మనదేశమందు నాటకులకు పూజనీయమయినఆదరణ రాకున్నది. కాని ఇతరదేశములరంగస్థలములచరిత్ర పరికించినచో, నవియును బాల్యావస్థయం దిట్లే యుండి నానాటికి గౌరవార్హము లయ్యెనని తెలియవచ్చుచున్నది. అట్టియోగ్యపదవికి మనరంగస్థలములను తేవలెనన్న, కొన్నివిషయముల గమనింపవలయు. వానిని నాకు స్ఫురించినకొలది నిందు పొందుపరచినాడను.

రంగస్థలములనుగూర్చి చర్చించునపుడు మూడువిషయములు ముఖ్యములు:— 1. నాటకసమాజమువారలు, 2. వా రాడునాటకములు, 3. వారిప్రదర్శనరీతి.

1. సమాజమువారిలో అధికారులు కొందరు, ఇతరులు తాబేదారులు. అధికారులకు ధనమూల మగుబాధ్యతయు, తక్కినయేర్పాటులగూర్చి పూచీయు నుండును. తాబేదారులకు ప్రదర్శనవిషయ మగుబాధ్యతయు, తదితరము లగుచిల్లరవిషయముల కొంతపూచీయు కూడ నుండును. ఇట్టియజమానులకును తాబేదారులకు ప్రస్తుతమం దుండుసంబంధము యుక్తముగా నన్నిచోటుల లేదు. ఏల నన, యజమానులకు తగినసామర్థ్య ముండదు. మనుష్యులను త్రిప్పుకొనెడుచాకచక్య ముండదు. అందుచే వీరికి పరస్పరమును ప్రతికూలసంబంధ ముండుటచే చీమ చిటుకు మన్న నొకరిని విడిచి యొకరికడకు పోవ ప్రయత్నించుచుందురు. కక్షలు తీర్చుటయు, స్వార్థపరాయణతయు నిందుకు ముఖ్య మగు కారణములు.

2. నాటకములు — ఇప్పుడు నాటకరచనయం దనేకులు కృషి చేయుచున్నారు. మననాటకములను మూడు తెగలుగా భాగింపవచ్చును:— భాషాంతరీకరణములు, అనుకరణములు, కల్పితనాటకములు. చివరతరగతి నాటకములు రెండు. కొన్నిటియందు ఇతివృత్తము కల్పితము; మరికొన్నిటియందు రచన కల్పితము. మరియు ఇతివృత్తమును బట్టి యీమూడుతరగతులనాటకములను చెరిమూడుతరగతులుగా భాగింప నగు. అనగా, చరిత్రకు సంబంధించినవి, పురాణగాథల ననుసరించినవి, సంఘసంబంధ మగునవి. చివర తరగతి నాటకములు అరుదు. ఇందు చాలభాగము పదిసంవత్సరములలోపల రచియింపబడినవానిసంఖ్య ఎక్కుడు.

వీనిలక్షణముల నే నెరిగినంతమట్టుకు వివరించెద. వీనియందు చాలభాగము గద్యపద్యములు తడక ల్లల్లబడినట్లు అల్లబడును గాని జిగిబిగి లేదు. పద్యములలోనివిషయము లతిపేలవముగ నుండును. భాష తప్పులతో నిండి, రచన రసహీనముగ నుండుటచే గణనీయ మగుకవిత్వ మే లే దని పండితులయభిప్రాయము. కల్పితనాటకములయందు చాలభాగము ఇతివృత్తము నేర్పుతో పొందుపరుపబడలేదు. ఆయాభాగములకు మాసికలు వేసినట్లు తోచును కాని, స్వాభావికముగా నవి అతుకుకొనవు. శైలి చాలమట్టుకు, ఇతరుల ననుసరించి వ్రాయబడినదే కాని నూతన మగుకల్పన లుండవు. భావశుద్ధి పూజ్యము. రసాభాస మంతటను స్ఫురించుచుండును. పాత్రములు స్వభావవిరుద్ధములు. పోషణ మెక్కడను కానరాదు. ఎవరిముచ్చట వారు తీర్చుకొనుచున్నారే కాని రంగస్థలములయోగక్షేమముల నారయరు. వినువారిమనములను, ప్రదర్శించువారిమనములను రసోత్పాదనము సున్న. ఇట్టియెడ, నాటకములు రంగస్థలముల కర్హములు కా వని నటులు కవులను, ప్రదర్శనాశక్తి లేమిచే పండువంటినాటకములను పల్చన చేసి రని కవులు నటులను నిందించుకొనుచున్నారు. వీరిద్దరు చెప్పినది సత్య మని నాయభిప్రాయము. కొన్నినాటకములు ప్రదర్శన కనర్హములు. వేరుకొన్ని ప్రదర్శనాకుశలత లేక పాడగుచున్నవి. మొత్తముపైని ఇట్టినాటకముల నొకసారి చదువువారును, ప్రదర్శించువారును, చూచువారును, రెండవసారి వానిజోలికి పోలేదు. అందుచేత వీనియందలియభిరుచి క్షణభంగుర మగుచున్నది. జనులకు నాటకము లన్న నసహ్య మగుచున్నది. ‘‘తా చెడ్డకోతి వన మెల్ల చెరుచును’’ అనుట సార్థక మగుచున్నది.

మరియు, శైలి సులభముగా నుండదు. పాకము కొన్నిచోట్ల ముదిరి మరికొన్ని చోట్ల నీ రగుచున్నది. తరుచుగా మారుమూలపదములు, క్లిష్ట మయినఅన్వయము, సూక్ష్మగ్రాహ్యము కానిభావమును కానవచ్చుచున్నవి. ప్రదర్శకులకష్టసుఖములను తలచుటయే లేదు. పాత్రములసంఖ్య లెక్కకు మీరుచున్నది. పునరుక్తిచే గ్రంథము విస్తరించుచున్నది. ప్రదర్శన కసాధ్య మయినరంగముల నుపయోగించుచున్నారు. హాస్య రస మసహ్య మగుచున్నది. మాటలు మానమర్యాదల నిలుపుట లేదు. పాడినపాటయే పాడవలయు. ఇతరగ్రంథములలోనిగద్యమును మార్చి పద్యముగను, పద్యమును మార్చి గద్యముగను రచించుచున్నారు. ఒకానొకచోట సామెతలపుట్ట. వచన మొకప్పుడు పత్రమంతయు నిండియుండును. వేరొకచోట నన్ని పద్యములే. రంగస్థలముల నొక్కొక్కవేళ నొక్కడే మొరపెట్టుచుండును. కథతో సన్నిహితసంబంధము లేని పాత్రము లుండును. అనవసర మైనసీనులు వేనవేలు. రెండుమాటలలో చెప్పవలసిన దానికి పెద్దపద్యము. మానవస్వభావపరిశీలనము మందున కైన కానరాదు. కొన్ని అంకములు వినుగు పుట్టించును. భాష అనేకవిధముల వికృతి నొందుచున్నది. ఇతి వృత్తమున కాని, కల్పనాచాతుర్యమున కాని సర్వజనాదరణీయ మగునాటకములసంఖ్య తగ్గుచున్నది. కొన్నిటియందు పాటలు చాల కలవు. కొన్నిటియందు లేనే లేవు. ఇందువలన సంఖ్య హెచ్చుచున్నను సరసత తగ్గుచున్నది. కొందరు దినమున కొకనాటకము వ్రాయగలరు. రసవంత మయినను కాకపోయినను ఎట్లో ముద్రింపబడుచున్నవి.

3. ప్రదర్శనము.—ప్రదర్శన మన పాత్రములయొక్క చిత్తవృత్తి మాటలమూలమునను, హావభావములచేతను చూపరులకు గోచరించునట్లు చేయుట. ఇందు చెప్పెడు మాట, చేసెడుచేష్ట అన్యోన్యావలంబినులు. మాట కనుగుణ మైనచేష్ట యుండవలయు; చేష్ట కనుగుణ మయినమాట యుండవలయు; ఇవి రెండును చూపరులకు స్పష్టముగా తోపవలయును. ఇవి సరిపోయినయెడల ప్రదర్శనము రసవంత మగును. లేనిచో రసాభాస ముదయించును.

చేష్టలలో ముఖచర్య ముఖ్యవిషయము. ముఖమునుబట్టి సాధారణముగా చిత్తవృత్తి నెఱుంగవచ్చు. తక్కినకరచరణావ్యవస్థ కూడ పాత్రమునుబట్టి రస మొకటి యైనను మారవలయు. మహారాజు దేవేరి ప్రాకృతులవలె శోకము వచ్చినప్పుడు నేలపై బడి దొర్లునా? ఆమెభాష, చర్య మారును కదా!

# ప్రదర్శనమునందలిలోపములు.

మొదటిది, నటులవిలాసము బాగుగ నుండదు. అనగా వారినడకరీతి, అవయవ చలనము, ప్రవర్తనము పాత్రోచితముగ నుండవు. ముఖచర్యలతారతమ్యము మననటుల పరికించి యుందు రేమో నాకు తెలియదు కాని, రంగస్థలములపై నున్నప్పుడు వారి ముఖచర్య రసమును స్ఫురింపచేయుటయే యుండదు- ఒకవేళ స్ఫురింపచేసిరా, మితి మీరును. కొన్నివేళల హాస్యాస్పదు లగుదురు. ఎట్లన, కొందరు శోకరసము గాని కరుణా రసమును గాని ప్రదర్శింపవలసి వచ్చినపుడు తమయశక్తిని సభవారికి వెల్లడి చేయుటకో అనునట్లు చేతిగుడ్డచే ముఖమును కప్పుకొందురు- కొందరు సభవారికి ముఖమును చూపనే చూపరు. మరికొందరు దొంగయేడ్పు ఏడ్చునటుల కన్నులు తుడుచుకొందురు- కొందరు గుక్క పట్టుదురు- అప్పుడు వారు చేయుధ్వని యెక్కిళ్లను బోలి యుండును- మొత్తముపైని ఈరెండురసములను రసోచితముగా ప్రదర్శించువారిసంఖ్య మిక్కిలితక్కువ.

ఇక శృంగారము-- ఇందు తైతక్కలాడుదురు. కొందరు వికారచేష్టల చేయుదురు. కొందరు రంగస్థల మన్నమాట మరచి నర్తింతురు- పాత్రోచితప్రదర్శన తక్కువ. వీరరసమునకును రౌద్రరసమునకును గలభేదమును పరికింపరు- రౌద్రమునందును ఇతరరసములనువలెనే దేశకాలపాత్రముల నాలోచింపరు. గాంభీర్యము ప్రదర్శింపనే లేరు. ఏయేచోటుల నేయేరసము నెట్లు ప్రదర్శింపవలెనో తమకు తెలియదు- ఒకరి నడిగి తెలిసికొనరు.

పెక్కుఉదాహరణము లిచ్చుటకు వీలు లేదు కాని రెండుపాత్రములగూర్చి క్లుప్తముగా నెరిగించెద. ఏలనన, వీనివిషయమై మనవారు గొప్పపొరబాటు చేయుచున్నారని నాయభిప్రాయము.

విశ్వామిత్రపాత్రము:— దీనిని ప్రదర్శించువారు రంగస్థలమునకు వచ్చినది మొదలు వెళ్లువరకు గుడ్లెఱ్ఱచేసియే యుందురు. ఇది స్వభావవిరుద్ధము కాదా? ఆఋషి ముక్కోపి యయి యుండవచ్చును. సదా కోపి కాడు కదా! అయిన నావేషధారి ఎల్లప్పుడు బొరవిరుచుకొని తిరుగవలసినదే? ఏమాట చెప్పినను అరచుటయే నా? తక్కిన ఋషులవలె కాక ప్రతిమాటకు గొంతు చీల్చుకొనవలసినదే? ఇందు ఒకరిని మించవలెనని మరియొకరు అంతకంతకు పెచ్చుపెరుగుచున్నారు. ఈసంగతి విశ్వామిత్రునికి తెలిసిన వీరి నేమి చేయునో!

పిమ్మట భీముడు— ఈతనివేషము భయంకరముగా నున్నట్లు ప్రదర్శించు చున్నారు. అన్నివిధములను రాక్షసవేషము ననుకరించుచున్నారు. ఈతడు మాట చెప్పునపుడు చిన్నపిల్లలు భయపడుదురు. ఉత్తమరాజపుత్రుడు కదా, ఇంతదుర్నిరీక్ష్యముగా నుండవచ్చునా? ఈతఁడు ఖడ్గవాదియే కాని రాక్షసుడు కాడు. యుద్ధసమయమున భీకరుడుగా నుండవచ్చును; తక్కినవేళల మనోహరరూపుడే యని నాయభిప్రాయము.

ఈపైరెండుపాత్రముల ప్రదర్శించువారిలో నెవ్వరు ఎక్కుడుధ్వని చేయుదురో, ఎవ్వరు మిక్కుటముగ చిందులు త్రొక్కుదురో, ఎవ్వరు రంగస్థలముల ధూళి నెగరజిమ్మ్రుదురో, వారు ప్రదర్శనాకుశలు లని మనవారు అభిప్రాయపడునంతకాలము, ఈపాత్రములు స్వభావోచితముగా ప్రదర్శింపబడవు. స్వభావము ననుసరింపనివారిని షేక్స్పియర్ 'Abominable imitators of humanity' పరమఅసహ్యపాత్రు లని నిరసించుచున్నాడు. కావున శీఘ్రకాలములో నీయభిప్రాయమును స్వీకరించి రంగస్థలముల నీమార్పులను చేసి ప్రదర్శనములను యోగ్యముగా చేయుదు రని ప్రార్థించుచున్నాడను.

రెండవది— స్వభావవిరుద్ధ మగునుచ్చారణ. ఏమాట చెప్పినను ఆరీతిని ఎలుగు తెచ్చిన ట్లుండకూడదు. వేషము వేయువారలు తమస్వభావముల నప్పటికి మరచి తమ పాత్రోచిత మగుస్వభావముల ననుకరింపవలెను కాని వీనిని కూడ దిగద్రావి రంగస్థలముపై నమానుషచేష్టలను చేసినచో, నె ట్లుండునో మీరే యూహింపుడు.

మూడవది— ఇవి యన్నియు బాగుగ నుండుటకు మూలము పాత్రునకు ఆమూలాగ్రముగా నర్థము తెలియుట. ఇట్టియర్థము తెలియకున్న భావము గోచరము కాదు. భావ మెరుగనివారికి సరియైనయుచ్చారణ ఎట్లు అలవడును? నిజము చెప్పిన నిష్ఠురము. అయినను న్యాయపక్షపాతులకు జనచిత్తానుసరణం బనావశ్యకము గావున చెప్పెద. మనవారిలో చాలమందికి తాము చెప్పెడు మాటలకే యర్థము తెలియదు. ఒకరు చెప్పెడుమాటలకు తెలియ దన్న నేమివింత? వీరికి భావము మొత్తముపైని తెలియు నేమో కాని, ప్రతివాక్యమందలిపూర్ణాభిప్రాయము తెలియదు. అందుచే నిందులోముక్క అందులోను, అందులోముక్క ఇందులోను గ్రుచ్చి అర్థము పాడుచేయుదురు. అర్థమును నేర్చుకొని భావమును గ్రహించిన గాని వారికి రసాస్వాదన యుండదు కదా. అట్టివారు వినువారిమనమున నెట్లు రసోత్పత్తిని గలిగింతురు?

అందుచే అభినయము చెడును కదా! ఇట్లు వీరు శ్రద్ధ లేక పాఠములు చదువుట వీరి లోపమో, మరి యొవరిలోపమో నేను గుర్తింపజాలకున్నాను. ఇట్టిలోపములు ఎవ్వరికిని నుండకూడదు. అందును ముఖ్యపాత్రముల గ్రహించువారియెడ బొత్తిగా నుండకూడదు. ఇందు ప్రత్యేక ముదాహరణములు అనావశ్యకము లని విరమించెద. ఇట్టిలోపముచే ప్రశస్తమయినగద్యపద్యములయందు కవు లుపయోగించినభావచమత్కృతి నిస్సార మగుచున్నది.

నాలుగవది:— రంగస్థలముల చిందులు త్రొక్కుట, బొంగరమువలె తిరుగుట, పీర్లపండుగలోని పెద్దపులివేషమును వినికిరి సేయుట— కొందరు నిల్చున్నచోటునుండి కదలక రాతిబొమ్మలవలె కరచరణములు కదల్పనే కదల్పరు. కొందరు కత్తులను చేతితో పట్టుకొని దానితోనే అభినయము చేయుదురు. అప్పు డాకత్తులు చేతికర్రలక్రింద నుపయోగపడును.

అయిదవది:— ఒకానొకప్పుడు తమవేషముమాట మరచిపోవుదురు. భృత్యుడు మహారాజునెడల నెట్లు ప్రవర్తింపవలయునో యెరుగడు. దాసీజనముమాట సరే సరి. మరది, బావ, ఋషులు మొదలగువారిని రానుకొనియే రాణులు రంగస్థలముల వర్తింతురు. ఇది యాయాపాత్రములకౌచితికి నెంతభంగము?

ఆరవది:— ప్రతిమాటకును ఊఁగొట్టుదురు లేదా తల యూపుదురు. ప్రక్క తెరలవారివైపు చూచుచు ముందువెన్కలకు కదలుచుందురు.

ఏడవది:— సభవారివైపెప్పుడు చూడవలెనో గుర్తింపరు. కొందరు తమపాత్ర మంతయు సభవారికే యొప్పగింతురు. ఎవరితో మాట్లాడుచున్నారో వారిముఖమే చూడరు. పరధ్యానముగా నుందురు. లేదా, ఉదాసీనభావము వహింతురు. ఇట్టి యెడల రసాభాసము కాక తీరదు. పద్యములమధ్య ముక్కుతోపనియెడల రాగమును మితిమీర సాగదీయుదురు. పార్టు బాగుగ వచ్చినను ఉచ్చారణ స్పష్టముగా నుండదు. కొందరు ముక్కుమాటలాడుదురు. ఇది శ్రోత్రపేయముగా నుండు నని తలచెదరు కాబోలు. కొందరికి నాసికములు పలుకుటకు వీ లుండదు. ఇది ముక్కుపొడిదోషము. కొసఅక్షరముల మ్రింగివేయుదురు. హ్రస్వముల దీర్ఘములవలె పలుకుదురు. ఆపవలసిన చోటుల నాపరు. ఒత్తవలయుచోటుల నొత్తరు. ఇందువలన తాత్పర్యము, తద్వారా రసమును చెడును. అందరకు వినబడునట్లు మాటలాడరు. కంఠధ్వనియొక్క హెచ్చు తగ్గులను (Modulation) గమనించరు. ఇది గద్యమందు జరుగుఅసందర్భవిపరీము.

ఇక పాటలు — కొన్ని నాటకములందు పద్యములకు మారుగ అడుగడ్డున పాటలు పాడుదురు. ఇట్టివి దేశీయతరహా ననుసరించి పాడిన మాటలైన వినబడు నేమో యని, కృతులమాదిరిని పార్శీ, ఇంగ్లీషు, హిందీమట్టుల ననుసరింప దలచి వానిలో నిముడని తెలుగుపదముల విరిచి ముక్కలు చేసి పాడుదురు. ఇందు రాగధ్వని తప్ప తదితర మేమియును వినబడదు. ఇందులో మిశ్రగతి వచ్చినప్పుడు చెప్ప నక్కరయే లేదు. పాటల పాడునప్పుడు భాష నొందువికారరూపములు త్యాగరాయకృతులు దక్షిణదేశస్థులు పాడినప్పుడు వినినవారికి బాగుగ తెలియును. రాగముయొక్క ఊపులు, పాడువారితలత్రిప్పులే కాని యొక్కమాట తెలియదు. ప్రస్తుతనాటకసమాజములలో పాటలవలన నిది యొకగొప్పచిక్కు. మట్లు మాటలను మచ్చ మాపుచున్నవి.

ఇక ఆపవలసినచోటులు గమనింపబడవు. పద్యముయొక్కయర్థము ననుసరించి చదువరు. వారిరాగము ననుసరించి పద్యము నడువవలసినదే. పద్యపాదమున వాక్యము పూర్తి కాకపోయినను రాగము ననుసరించి ఆపువారు కొందరు; దీర్ఘము వచ్చినచోట్ల నెల్ల రాగము ఇంచుమించుగా శక్తికొలది తీయువారు కొందరు; పద్యములోనిముక్కలను పాదముల మ్రింగువారు కొందరు; తప్పులు చదువువారు కొందరు; ఛందోభంగము చేయువారు కొందరు; ఏదోరీతిని పద్యమును పాడుచేయువారే కాని ఆపద్యమున అర్థచమత్కృతి గాని, పద్యరచన గాని, భావసరసత గాని, యమకాద్యలంకారములను గాని వివరించురీతిని చదువువారు బహుఅరిది. రాగమునందే గురి యుంతురు గాని, రసము ననుసరించి చదువరు. ఇవి యన్ని పరికించిన నాకు శ్రావ్యమైనకంఠధ్వని ఇట్టివారికి యుండుట రసాభాసమున కొకహేతు వగుచున్న దని నమ్మకము తోచుచున్నది; ఇది నాటకుల తప్పు. అయినను ప్రాకృతజను లామోదించుటచేతను ధనము వారివలననే ముఖ్యముగా వచ్చుచుంటచేతను ఎంత చెప్పినను సమాజములవారలు నామాటల బెడచెవిని పెట్టెద రని నాకు తెలియును. ఐనను నాకు తోచినమాట నే జెప్పితి. ఇందలినిజము నొక్కడెరిగి, తనలోపమును దిద్దుకొనచూచిన నాప్రయత్నము సఫల మగును.

పిమ్మట తమవంతు వచ్చినవారు తాము పార్టును చెప్పునప్పుడు కొంచెమొ గొప్పో అభినయము చూపుదురు గాని తాము, రంగస్థలమున నుండునప్పుడు తమలోనికొందరు ఏమి మాట్లాడినను ఎక్కడనో యని ఊరకుందురు. ఇందువలన రసభంగము కలుగును. తాము మాటలాడునప్పుడువలె ఇతరులు మాటలాడునప్పుడును యుక్త మగు రసముల

మోమున దోపజేయవలయు కాని, తమముందుపద్యముల కేరాగములు ఏరీతిని పాడవలెనో వానిగూర్చి తలచుచు గాని, సభవారిలో నేరినో చూచుచు గాని, పరధ్యానముగా నుండరాదు. పదిమంది యున్నప్పు డొకవేళ నీలోపమును సభికులు చూడకున్నను ఒకరిద్ద రున్నప్పుడు తప్పక చూచెదరు. అట్టియెడ వానిలోపము తేటతెల్ల మగును.

పిమ్మట నాటకమందు తమపార్టు యెక్కడెక్కడ నున్నదో అన్నిచోట్లను రసపుష్టి యగుపడునట్లు అభినయింపవలయు గాని కొన్ని అంకములయందు బాగుగ చేసి మరి కొన్నిటియందు మానకూడదు. ఇటు లన్ని చోటుల నేకరీతిని బాగుగ చేయువారిసంఖ్య మిక్కిలితక్కువ. ఇట్లొకదినమున నే కాక అన్నిదినముల నట్లే కనపరుపవలెను. మనము చూచుచుండెడునటులు ఒక్కొకదినమున బాగు సేయుటయు, మరియొకదినమున భ్రష్టు చేయుటయు తటస్థించుచున్నది. నేర్పరియైననటు డైనచో తనభాగము భ్రష్టు సేయ కారణమేమి? దీనివలన మనస్ఫూర్తిగా ప్రదర్శింపలే డనుమాట స్ఫుటబడినది. అందునకు వీ లెట్లు కలిగెను? [యజమానులు సరిగా బోధింపకుండుటచేతనా, లేక ముందుగా తయారు చేయక పోవుటచేతనా?] ఇప్పుడు మనవారు **Rehearsals** గూర్చి మిక్కిలి ఉపేక్షభావము వహించుచున్నారు. ఇట్లు పలుమారు వేయుటవలన తప్పులు తగ్గుచుండును. విలాసార్థము వేయువారికి **(rehearsals)** వీలు లేకపోయిన లేకపోవు గాక. ఇదియే వృత్తిగా నభ్యసింపువా రిట్లేల సేయరు? ఇట్లు సేయక నాటకములను పాడు చేసినవారియందు చూపరుల కెట్టిదురభిప్రాయము పడునో, అందువలన నెట్టిచెడు పేరు వచ్చునో, వారాలోచింపరు. ఇందువిషయమై కొంచెము ప్రక్కదారిని పోయెద. నాటకములలో సాధారణముగా పాత్రములు గ్రహించెడువారు నాటకసమయమునకు ఎక్కడనుండియో ఊడిపడుదురు. మరికొందరికి తా మేపార్టులు వేయవలెనో తెలియదు. వారు పార్టు ముందుగా చూచుకొనుటకు వీ లుండదు. కొంచెము పేరు పొందినవారు మనోనిబ్బరముచే పుస్తకము ముట్టనే ముట్టరు. కొన్నివేళల వీరికి మారుగ నాటకసంఘమువారు మరికొందరను నిర్ణయింతురు. ఇట్టివారు తా మాపాత్రము స్వీకరింప నవసర ముండునో, యుండదో తెలియకపోవుటచే మనస్ఫూర్తిగ చదువరు. హఠాత్తుగా వేయవలసినప్పుడీరెండువిధములవారికిని తప్పులు కుప్పలుగ నుండును. నాటకమున రక్తి చెడును. కొన్నివేళల నాపాత్రమును నాటకమునుండి తీసివేయుదురు. అం దుండురసము బొత్తిగా చెడును. బాగుగ నభ్యసించినవారికే కొన్నియెడల ప్రమాదములు తటస్థించునపుడు చదువనివారిసంగతి వేర చెప్ప నేల?

కొన్ని పద్యములలో కొంతవరకు నొకరసమును మరికొంతలో భిన్నమైనరసమును నిమిడియుండును. వీనిని వరికింపరు. ఈవిషయము పద్యముల రాగమాలికతో చదువువారియెడ వర్తించును.

కొన్ని సందర్భముల రంగస్థలములం దసందర్భపుపనులు సేయుదురు. కాశికాపుర శ్మశానభూమి రంగస్థల మగునప్పుడు కొందరు అసందర్భముగను అసహ్యాకరముగను వేషములు వేసుకొని ఏడ్చుచు మొఱ్ఱపెట్టుచు వత్తురు. ఇందు శోకము పుట్టుటకు మారు అసహ్యము పుట్టును. హరిశ్చంద్రుడు కాశికాపురములో నున్నంతకాల మాతని ప్రతిభచే నక్కడ మృతులే లే రని మనపురాణములు ఘోషించుచుండగా నీమహాత్ములు చేయునల్లరి ఏమిరసవంతముగా నుండును? వీరబాహువీరనాయకులు త్రాగినట్లు వచ్చి రంగస్థలముపై చేయునల్లరి మితియే లేదు. రసానుగుణముగా నాటకకర్త నాటకము వ్రాయగా వీరికపనము, విపరీతచేష్టలు మన కేల? ఇట్టియసంగతపుపనులు చేయుటచేతను, అప్రాచ్యపుకూతలు రంగస్థలముల పలుకుటచేతనే కద విద్యావంతులు, నాగరికులు వీధినాటకముల చూడ నొల్లరు. ఈవిషయముల నాటకముల రొక్కువ యేమి?

పైని చెప్పినలోపమునకు ముఖ్యహేతువు వానిగూర్చి బాగుగ తెలిసికొనకపోవుటయే. ఈవిషయమై పాటుపడువారు కూడ కాన్పింపరు. అభినయము నేర్చుకొనవలసిన యంశ మని యెంచువా రుండరు. ప్రతివారు తమకు ప్రదర్శనాశక్తి పూర్ణముగ నున్నదనియే భావింతురు. ఇందున కనుగుణముగా అభినయమును నేర్పువారిని సామాజికు లేర్పరుపరు. ఎవరికి వారే గురువులు. ఒకరు చెప్పునట్లు వినుటకు అట్లు చెప్పువారు తమకంటె బాగుగ తెలిసినవారు అని ఒప్పుకొనువా రెవ్వరు? ప్రతివానికిని ఏదో లోపముండును గదా! దీనిని గొప్పగా జేసి చెప్పెడువారే కాని వారి కేవిషయము బాగుగ తెలియునో ఆవిషయమును నేర్చుకొనుట కుత్సహించువారు లేరు. నాటకసమాజము వారి కందరకు అభినయము నేర్పుటకు ఉద్యోగస్థులు నియమింపబడరు. అందుచే ఎవరి మట్టుకు వారు చెప్పుకొనవలసినదే. వీ రెప్పుడును దోషైకదృక్కు లగుటచే నితరులసుగుణముల నెరుంగజాలరు. అందుచే వీరియభివృద్ధి కనుబొమలపై వెండ్రుకలవలె నుండును.

మరియు ఉచ్చారణమునకును, అభినయమునకును ప్రతికూలమై, సర్వజనులచేతను రంగస్థలములకు శిరోభూషణ మని యెంచబడుకారణ మింకొకటి కలదు. అది సంగీతము. ఇది పామరులకును పండితులకును, పిన్నలకును పెద్దలకు ను మనమున కాహ్లాదము కలిగించును.

"లోకము పగ యగు పరుసనివాకున, చుట్ట మగు మధురవాక్యములవలనన్."
మంచికంఠధ్వని కలవానిదే రంగస్థలమున ప్రతిభ. "ఎలు పేదునంకలు దీర్చును కాని సంగీతము చాలవంకలను దీర్చును." ఉచ్చారణ పాడైనను సరియే, మాట వినిపింపక పోయినను సరియే, కంఠధ్వని రసమునకు తగి యుండకపోయినను సరే, అర్థము తెలియక పోయినను సరే, కంఠమును గిరుప్రన త్రిప్పియు, పాలికేకలు వేసియు రంగస్థలమున ప్రతిశబ్ద మగునట్లును, వినువారిచెవులు గీగీ మనునట్లును పాడిననటుడు ప్రసిద్ధిజెందుచున్నాడు. ఇంతకంటె పెడత్రోవ మరి యుండదు. ఈవిషయమై నాయభిప్రాయమును వ్యక్తపరచెదను.

సంగీతపరీక్ష రంగస్థలములయందు కాదు. వేరేసభలు చేసి వారిని మెచ్చి పారితోషికముల నొసంగుదురు గాక. రంగస్థలమందు అభినయము ముఖ్యవిషయము. అందుకే రంగస్థలము లేర్పడినవి. ఈనాప్రార్థన విందురు గాక. రంగస్థలములను పాటకచ్చేరీలగా మార్చి వానియుద్దేశమును పాడు సేయకుడు. నాటకము చూడ బోవువారు రసోచితమయినఅభినయము కలదా లేదా యనువిషయమును ముందు గణింపవలయును. సంగీతము వెనుకబడవలసినదే. ఎంత బాగుగ పాడినను అభినయము లేనియెడ మెచ్చకుడు. రెండుపాళ్లు అభినయము, ఒకపాలు మాట, తక్కినపాలు సంగీతము నుండవలయునని నాటకము చూడ బోవువారు నిశ్చయించుకొనినయెడల నటులు అభినయము నభివృద్ధి చెంద పాటుపడుదురు రేపో అనునాశ నామనమును బాధించుచున్నది. నాటకము చూచి బాగుగ నున్నదనువా రెల్లరు పాటలు చూచి సంతోషించినయెడల నాటకరంగస్థలములు సంగీతసభలుగా మారును. వానిప్రయోజనమే యుండదు. అభినయవిద్య నశించును. కాబట్టి ఇప్పటికే అడుగంటినఅభినయమును పాతాళమునకు త్రొక్కక దినదినము అభివృద్ధిలోనికి తెచ్చి రంగస్థలముల పేర్లను సార్థకపరుపుడు. ఇది నాయొక్కని అభిప్రాయమే కాదు. దీనికి కారణముల నిందు పొందుపరచెద. సంగీతము పాడువారందరు ఇంచుమించుగా రాగాలాపన చేయక మానరు. ఇట్టిఆలాపన చేయకున్న వారిప్రకర్ష కాన్పింపదు. మెప్పూ రాదు. ఇట్లు చేయుటలో నెంతచతురు లైనను తల విసరుట, ముఖము చిట్లించుట, పెదవులు విరుచుట, కనుబొమ లెగరవేయుట, చేతులు కదల్చుట, కన్నులు మూయుట, నోరు తెరచుట, వంకమూతి పెట్టుట, మొదలగుతదంగములలో నొక్కటొక్కటి గాని అన్నియు గాని చూపక మానరు. రాగప్రస్తార మెరుంగువారు వీ లగునోట్ల నెల్ల రాగము వినుచుందురు. దీర్ఘాక్షరము వచ్చినప్పు డెల్ల వారికి పండుగ.

ఇందుచే పద్యమును వారిరాగముచే నులిపి నులిపి, ఎగలాగి, దిగలాగి, అంతరిక్షమునకు విసరియు, పాతాళమునకు క్రుంగించియు, అంతరాళమున గుంజి గుంజి, మాటలను కొన్నిటిని మ్రింగి, కొన్నిటిని తెగసాగదీసి, ఎన్నివిధముల భ్రష్టముగా చేయవలెనో అన్నివిధముల పాడు చేయుదురు. మాటలు దూరముదూరముగా నుచ్చరింపబడుటచేతను, రాగము మనము నాకర్షించుటచేతను, పద్యముయొక్క అర్థము తెలియక, కవిఅభిప్రాయ మేమో పరికింపలేక, పాత్రముయొక్క చిత్తవృత్తి నెరుంగజాలక వినువారు సంగీతసముద్రములో మునిగియుందురు. పద్యము వారిచెవిని పట్టదు. ఇది బాగుగ సంగీతవిద్య నేర్చినవారును, శ్రావ్యమైనకంఠము కలవారును చేయుపని. ఇక సంగీతము నేర్వనివారు, రాగమున కొక్కటియే కళ; ప్రతిచరణమం దదియే. పెద్దపద్య మయినచో నిది వినుగు పుట్టించును. కొందరు మంచిమంచిసంగతులు వేయుటకై ప్రయత్నించి అవి పడక క్రొత్తగా నడవ నేర్చినబాలకులవలె పిల్లిమొగ్గలు వేయుదురు. ఊహ గొప్పది; ఆయము లేదు. కొందరు రాగము తీయక యుండకూడదు గాన, తలత్రిప్పుతో రాగపూర్తి చేయుదురు. వీరిలో చాలమందికి శ్రుతికిని తమకంఠమునకును ఎట్టిసంబంధ ముండునో తెలియదు. శ్రుతికి తగ్గియున్నభాగములు విన్పింపవు కదా, శ్రుతికి మీరినవి నసాలమంటి రసమును శుష్కింపచేయును. ఇట్టిచో నాటకమునకు వచ్చినవారలకు కన్నులు లే వని నటులు భావించిన ట్లగు. అంధులయెదుట నాడబడునాటకమునకు సంగీతమే ప్రధానము. కాని కన్నులు కలవారు వీరిముఖచర్యలను చూడలేక తల వంచుకొనవలసివచ్చుచున్నది.

ఇంతగా ప్రదర్శనాశక్తినిగూర్చి వ్రాయుట కవసర మే మని కొంద రనుకొనెదరేమో? అందుకు తగినసమాధాన మే మన, ఇది యొకవిద్య. బహుప్రయాసముచే నేర్చుకొనిన గాని రాదు. ఏల నన, పూర్వులచిత్తవృత్తులను భావించుకొనుట చాల కష్టము. అందునను మనస్వభావమునకు వ్యతిరిక్త మయినస్వభావము గలపాత్రముల చిత్తవృత్తులను భావించుకొనుట మిక్కిలి కష్టము. హాస్యరసము కొందరి కొప్పును, వారు నీచపాత్రములు వేయుటకు పనికివత్తురు. ఇట్టివారికి గొప్పపాత్రము లిచ్చిన వ్యక్తపరుపజాలరు. ఇతరదేశీయులలోను కూడ దుఃఖాంతప్రదర్శకులు (Tragic actors), సుఖాంతప్రదర్శకులు (Comic actors) అని వేరుగా నుందురు. ఏపాత్రములవా రాపాత్రములనే గ్రహింతురు గాని అన్నిటికి తగుదు నమ్మా యని సిద్ధపడరు. హాస్యరసమును తరుచుగా ప్రదర్శించువారు శోకరసమును యుక్తముగ ప్రదర్శింపలేరు. అట్లు చేసినచో ర కి చెడును.

స్త్రీవేషధారులకు కష్టతరమైనవ్యావృత్తి కలదు. వారు నడిచెడునడక, పలికెడు పలుకు, చేతులు ముఖము త్రిప్పుట మొదలగునవి స్త్రీస్వభావయుక్తముగ నుండవు. ఇట్టివారికి సంగీతమందు ప్రవీణత యున్నచో, పైని చెప్పినతదంగము లలనడి నీరిచేష్టలను స్వభావమునకు మరికొంత యెక్కుడుదూరము చేయును.

సంగీతమువిషయమై ఇంత కఠినముగా వ్రాసితి నని కిన్కవహింపకుడు. నాకు దానియం దభిరుచి కలదు. విని యానందింప గలను. కాని అది రంగస్థలములయందు మితి మీరుచున్నందునను, రసాభాసమునకు ముఖ్యహేతు వగుటచేతను, రంగస్థలముల యందు నా కుండుఅభిమానముచేతను, అవి పాడగుచున్న వన్న విచారముచేతను నిట్లు వ్రాసితిని.

మనవా రప్పుడప్పుడు ఫార్సులను వేయుదురు. ఇందలిఇతివృత్తములు నీతి బాహ్యాము లయి యుండును. ఇట్టివి చాలవరకు తగ్గుచునే యున్నవి, కాని రంగస్థలమున ఏమాత్రము కాలయాపనము కావలసినప్పుడును, నాటకము త్వరలో ముగియునప్పుడును ప్రహసనములు వేయుదురు. ఇట్టివి ప్రాకృతజనమునకు రుచించును. పండితులను కూడ సంతోషపెట్టవలయు కదా! ఈపట్ల నా కొకటి స్ఫురించుచున్నది. ఇప్పుడు మనసంఘములో ననేకవిషయములు దిద్దవలసినవి యున్నవి. ఇవి ప్రాకృతులకు బోధ చేయుటకై విద్వాంసులు వాదములవలన కొంత ప్రయత్నించిరి గాని, ఎట్టిసంస్కరణమునకు వారొప్ప రైరి. ఈవిషయమున రంగస్థల మొకసహకారిగా నుండిన బాగుగ నుండు నని నాకు తోచుచున్నది. కాని యిట్టిప్రహసనములను పండితులచే నెవ్వరిమనసు నొప్పింప కుండునటుల వ్రాయించి అవి ప్రదర్శించినచో నీతిబోధకములుగా నుండుటయే కాక మనసున కాహ్లాదము కూడ పుట్టించును. ఇట్టివి చిన్నవిగా నుండి సులభశైలిని గద్య పద్యాత్మకముగా నుండవచ్చును. ఇందువలన నాయామార్పులు త్వరలో జనసమ్మతమును వడయును. ఇది యొకక్రొత్తపుంత. నిరపాయ మయినది కావున నాటకసంఘములవారు దీని నామోదింతు రని నే తలచెద.

నే నిం దుదహరించినరీతిని నాటకములతారతమ్యముల గ్రహించి ప్రజలు అభినయవిద్య కెక్కుడుప్రాముఖ్యత నిచ్చి తక్కినవాని నెక్కుడుగా గణన సేయక యుందు రని నాప్రార్థన. ఇక నాటకులు నేను కనబరచినదోసములకు నన్ను మన్నించి వారివారి కేలోపము లుండిన దిద్దుకొనుచు రంగస్థలములను నింతకంటె ప్రాముఖ్యతలోనికి తెచ్చి పండితకోటిని సంతోషపెట్టుట ముఖ్యవిషయముగ భావింతు రని తలచుచున్నాను.

విద్యాధికులు రంగస్థలములయెడల నిప్పటిఉదాసీనభావమును త్రోసి వానిలోపములను యజమానులకు జూపి దిద్దించి నాటకముల నామోదించి తమకొరకై ధన, కాల, వ్యవసాయముల వ్యయము చేయువారికి తగుధనసహాయము చేయుదురు గాక! మరియు తాము సుబోధన సంఘమువారికి చేయుటకు వీలు లేదు కావున సంఘాభివృద్ధికై పాటు పడెడునాటకసమాజమువారిని ప్రోత్సాహపరుతురు గాక! ఒకవేళ రంగస్థలములు నీతి దాయకములుగ లే వందురో, వాని నేల సంస్కరింపరాదు? వారు మౌనము వహించిన యెడల కొలదికాలములలో మనరంగస్థలము లింతకంటె నీచస్థితికి వచ్చి సంస్కరణమున కనర్హము లగును.